# అక్షరం నా అస్తిత్వం

పుట్టినైదు నెలలకే మృత్యువుతో ముచ్చటించినవాడ్ననుకుంటా. ప్రేమతో అక్షరమనుగ్రహించినప్పట్నుంచి మొదలైన నిత్యాన్వేషణనెన్నో నిద్రలేని నిర్జన రాత్రుల్ని ప్రసాదించింది. ఆ అఖండమైన మిసిమాన్విత ప్రభాతాలన్నింటిని పొదివి పట్టుకు పోదామనుకుంటుండగానే గతానికి వీడ్కోలిచ్చేసిన ఆగతం తన ఆత్మకథలోని అంటరాని అధ్యయనంలోకి నన్ను ప్రవేశపెట్టింది. ఎప్పట్నుంచో వేకువని వెత్కుతున్న పీడిత స్వరాల స్వగతాలు ఆర్ద్రంగా స్వాగతం చెబుతుంటే అంతదాకా ఎప్పుడూ పట్టుకు తట్టని చిట్టచివరి తలుపు నెట్టి లోపలకి అడుగు పెట్టాను.

ఒక్కసారిగా నా లోకం తలకిందులైపోయింది. అడుగడుగునా అణగారిన బతుకుల వెలివేతల భారతం వికటహాసం చేస్తోంది. అగ్రకుల హైందవ నాగరాజు విలయతాండవమాడుతోంది. మడికట్టు మృగాలు పడికట్టు పదాలతో అడ్డంగా దడికట్టిన అభాగ్యుల ప్రతిభ స్పష్టంగా కనిపిస్తోంది. చెదురుమదురుగా పడున్న ఏకలవ్య వేళ్ళూ, శంభూకుడి తల కరతాళ నృత్యంతో రోదిస్తున్నాయి. అంతులేని అద్భుతమైన కాంతిపుంజాల్నింత కాలం కుట్రపూరితంగా ఖైదుచేసిన క్షుద్ర చరిత్ర  కళ్ళముందే సాక్షాత్కరిస్తోంది.

ఆ కుటిల చాతుర్వర్ణ ద్విజనిజపు దౌర్జన్యసౌధాన్ని కూల్చడానికి ధ్వజమెత్తిన భావుకత్వం భావోద్యమాల ఆలోచనైతే, చేతనత్వం బౌద్ధికోద్యమాల ఆచరణ. ఆ రెంటి సమన్వయ సమ్మేళనమే సమానతను కాంక్షించే మానవీయ సాధనా సౌరభం, వంచనను ప్రతిఘటించే వజ్రాయుధ కౌశలం, నిర్భాగ్యుల నిజగొంతు నాదాల్ని వినిపించే నిరంతర గళం. ఆ బాధాతప్త నినాదాలకి స్పందించడమే బాధ్యతాయుత కలాల కర్తవ్యం, భయాల్లేని హృదయాల వ్యక్తిత్వం, భారమైన అక్షరాల అస్తిత్వం.

అసహాయులపై జరిగే అన్యాయాల్నీ, అక్రమాల్నీ మొత్తంగా నిర్మూలించి అసమానతల్నంతమొందించడమే నా అడుగుల్లోని ఆలోచనల అనుభూతిని అస్తిత్వంలో నిరూపించడానికి ముందుకెళ్తున్న అక్షరాల రచనా లక్ష్యం, వచనపు మార్గం, అంతిమ ధ్యేయం!

# కులానికో సవాలు!

## (Challenge to the Caste)


గౌరవ్



**ప్రశ్న అధ్యయన వేదిక**

ఆంధ్రప్రదేశ్ – తెలంగాణా

“ఒకే వ్యక్తి వ్యతిరేక భావాల్ని వెల్లడించడాన్ని చాలా మంది మంచి దృష్టితో చూడరు. ఆ భావాలు వెల్లడించిన వ్యక్తిలోని మానసిక ఆరోగ్యాన్ని శంకించడం మొదలుపెడతారు. కాని ఈ వైఖరి సమంజసమైనది కాదు. వ్యతిరేక భావాల్ని వెల్లడించడంలో అసహజత్వం ఏమీ లేదు. వివేకం గల ఆలోచనాపరుడు పరిస్థితుల పరివర్తనను అనుసరించి వ్యతిరేక భావాలను వెల్లడించక తప్పదు. ఈ విధంగా వెల్లడించడం సత్యవిరుద్ధం కాదు. కోర్టులో సాక్షి నాలుగు సంవత్సరాల క్రితమూ తన వయస్సు ముప్పయి సంవత్సరాలు అని చెప్పి ఈ సంవత్సరం కూడా ముప్పయి సంవత్సరాలే అని చెప్పి తానెల్లప్పుడూ ఒకే మాట మీద వుంటాను కాని తడవకొకమాట మార్చను అని తన సత్యవాదాన్ని రుజువు చేసుకోడానికి ప్రయత్నించడంలో ఎంత సత్యం వున్నదో భావాలను మార్చకుండా ఎప్పుడూ ఒకే విధమైన భావాల్ని వెల్లడించడంలో కూడా అంతే సత్యం వుంది.... భావాలను మార్చుకోవలసి వచ్చినపుడు మార్చకపోవడం ఎంత అసమంజసమో మార్చుకోవలసిన అవసరం లేనప్పుడు మార్చడం కూడా అంత అసమంజసం. ఒకే వ్యక్తితో పరస్పర విరుద్ధ భావాలు అభివ్యక్తి పొందడంలో అసమంజసమేమీ లేదు. అన్ని కాలాల్లోని, అన్ని దేశాల్లోని మనుషులందరిలో ఈ సత్యం కనిపిస్తూనే వస్తుంది.”

– సంజీవ్‌దేవ్

తుమ్మపూడి (ఆత్మకథ), పేజి-442.

“అందరకు అర్థమయ్యే విధంగా రచించాలి, చిత్రించాలి అనటం ఒక ప్రజాస్వామ్య నినాదంగా మాత్రమే పనికొస్తుంది. కాని ఆచరణకు అంతగా ఉపయోగపడదు. ప్రజలందరికీ ప్రతీదీ అర్థం కావాలంటే ప్రజలకు ఆయా విషయాల్లో తర్ఫీదు ఇవ్వటం వల్ల అది కొంతవరకు సాధ్యపడుతుంది. రచయితతో “మీరు రచించింది నాకర్థం కావట్లేదు” అని పాఠకుడు అంటే, “ఒకటి రెండు సార్లు అర్థమయ్యేలా శ్రమపడి చదవండి” అని జవాబివ్వటం రచయితిచ్చే సరైన జవాబు. ఇక అర్థంకాని నూతన విషయాన్ని వెతుక్కోవలసి వచ్చినపుడు ఆ నూతన విషయాన్ని నిందించక దాన్ని తెలుసుకునే శ్రమ చేయాలి. లేనిచో ప్రజానీకపు మానసిక స్థాయి వృద్ధి చెందక ఏ దశలో ఉన్నది ఆ దశలోనే వుండిపోతుంది... శ్రమ చేయకుండా తమకు అదీ ఇదీ తెలియడం లేదనడంలో అర్థం లేదు. తాము శ్రమచేయకుండా తమకు అదీయిదీ తెలియని కారణాల్ని రచయిత మీద రుద్దటం అన్యాయమూ అక్రమమూ కూడ. అయితే, కొందరు రచయితలు తమకు స్వయంగా తెలియని గొట్టు పదాలను కూడా తమ రచనల్లో వాడటం, ఇతర్లకు తెలియని పద్ధతిలో రచిస్తే మాత్రమే అది గొప్ప రచన అని ఆ విధంగా రచించబూనటం కూడ మానుకోవాలి. ఇతర్ల అజ్ఞత విజ్ఞతకు గీటురాయి అని భ్రమించటం ప్రమాదకరం అవుతుంది. అయితే, సంతోషకరమైన విషయం ఏమంటే ఇటువంటి రచయితలు ఎక్కడో అరుదుగా మాత్రమే వుంటారు. వారు ఇతర్లకు తెలియరు, ఇతర్లను వారు తెలుసుకోరు.”

– సంజీవ్‌దేవ్

తుమ్మపూడి (ఆత్మకథ), పేజి-597

**కులానికో సవాలు!**

(వ్యాస సంకలనం)

గౌరవ్

సొసైటీ ఫర్ సెక్యులర్ స్టడీస్ (లౌకికవాద తాత్విక అభివృద్ధి సంస్థ) ఆధ్వర్యంలో

అక్టోబర్ 2014

ప్రతులకు : 9440040826, 9441089829

ప్రతిపాదిత చందా : 20/-

ప్రచురణ సంఖ్య : 12

## మా ఇతర ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | ప్రజాస్వామ్య పతనం | ₹20/- |
| 2. | అరాజకత్వం అంటే ఏంటి? | ₹10/- |
| 3. | సాంఘిక తత్వం – వైప్లవ మార్గం | ₹20/- |
| 4. | ఒక నాస్తికుడి నామా | ₹15/- |
| 5. | ప్రజాస్వామ్య ప్రస్థానం | ₹10/- |
| 6. | అస్తిత్వం – అరాజకత్వం | ₹20/- |
| 7. | మద్యంపై యుద్ధం | ₹10/- |
| 8. | మతానికి మరణశాసనం – మనిషికి పునరుజ్జీవనం | ₹ 5/- |
| 9. | కరపత్రాల కథాకమామిషు | ₹40/- |
| 10. | తత్వ విచారణ – తర్క వివేచన | ₹30/- |
| 11. | పురుషుడు – స్త్రీ (చలం Man & Womanకి స్వేచ్ఛానువాదం) | ₹10/- |



# మనవి

"We talk about castism and may condemn it as we should. But the fact remains that half-a-dozen or may be ten so called superior castes dominate the indian scene among the Hindus. There is no doubt about it. And if we talk about the removal of castism, don't understand by that, i want to perpetrate the present classification, some at the top, and other people at the bottom. If we do not equalise ofend to equalise undoubtedly castism will florish in a most dangerous way." – *Jawaharlal Nehru*

ఆ మధ్య రాష్ట్రంలోని బౌద్ధ సంఘాల్ని చూసి ముక్కుమీద వేలేసుకున్న నాకు కుల నిర్మూలనోద్యమాలతోనూ, మత విమోచనోద్యమాలతోనూ నిజమైన బౌద్ధ తాత్వికతను సమన్వయం చేయడం అవసరమనిపించింది. ఇందులోని మొదటి వ్యాసాన్ని చూసిన నాస్తిక హేతువాదులు ఏ మాత్రం హుందాగా స్పందించినా నా ఆలోచన ప్రచురణ దాకా వచ్చేది కాదేమో. దశాబ్దాల చరిత్ర కల నాస్తిక హేతువాదోద్యమాలు శాస్త్ర ప్రచారం కావించినంతలా దార్శనికతను పాటించడంలో వెనుకబడ్డాయనే విమర్శ ఉద్యమ నిజాయితీ గల పునరాలోచనాపరులకు మింగుడుపడినంతలా తామున్న ఆలోచనాచట్రంలోనే పరిభ్రమించే ఊకదంపుడు నాయకులకు నచ్చకపోవడం వారి స్వభావ లోపమే కాని నా విధాన లోపం కాదు.

వర్తమాన వ్యవస్థలోని బౌద్ధ సంఘాలకీ, శుద్ధ హిందూ భజన సంస్థలకీ పెద్దగా తేడా కనబడకపోవడం వల్లనే నేననుకున్న మార్గంలో ఈ చర్చను విస్తృత పరచాల్సొచ్చింది. ప్రత్యామ్నాయ వుద్యమస్ఫూర్తిని వెతుక్కునే క్రమంలో అభివృద్ధికి నిర్వచనం అధికారంలోనున్న వాళ్ళిచ్చినంత కాలం అణిచివేయబడుతున్న వాళ్ళ అరుపులు ఈ దేశంలో అనాగరికంగానే వుంటాయనే నిజం తెల్సొచ్చింది. స్త్రీలపై అత్యాచారాలకి మూలం వారి వస్త్రధారణేనని తేల్చే ప్రబుద్ధులకి దళిత బహుజనుల హత్యలకి కారణం కూడా 'సహజ న్యాయం'లాగానే కనిపించడం అగ్రవర్ణ భావజాలపు, దౌర్భాగ్య లక్షణమే ననడంలో సందేహం లేదు.

బతుకీడుస్తున్న వాటికంటే భవిష్యత్తులో రాబోయే రోజులు బాగుంటాయనే ఆశని బేరీజు వేసుకుంటూ కాలం గడపడం దళిత బహుజనుల దైనందిన కార్యక్రమంగా చెలామణి అవుతోన్న సమాజంలో నేటి కంటే రేపటి తరం చల్లగా

వుండాలని కోరుకునే భారమయిన మనసులతో మసలడమే సగటు జీవుల సాదా జీవనంగా సాగిపోతోంది. ఇలాటి సమయంలో అంబేద్కర్‌నూ, ఆయననుసరించిన బౌద్ధాన్నీ అహేతుకంగా ఆరాధించడం కంటే హేతుబద్ధంగా అధ్యయనం చేయడం విజ్ఞత కాగలదనే దృష్టే ఈ రచనకు కారణం. "Mankind can finally place its trust not in a proletarian authoritarianism, not in a secularized humanism, both of which have betrayed the spiritual property right of history, but in a sacramental brotherhood and in the unity of knowledge అంటారు Ruth Nanda Anshen, World perspectives ప్రచురించిన ఇవానిల్లిచ్ Tools of conviviality గ్రంథానికి రాసిన చివరి మాటలో. ఆ తరహాలో ప్రస్తుత అప్రజాస్వామ్య వినిమయత్వ సమాజానికి భిన్నమైన ఆలోచన చేస్తున్నవారికి ఈ రచన కొంతవరకైనా తోడ్పడితే అంతకు మించిన సఫలత ఇంకేమి లేదనుకుంటాను.

**"What's a reality**
**of the mortal struggling**
**in the periphery of endless time**
**life's but**
**one suffering dream**
**for him**
**Who seeks**
**the truth**
**upon this earth!"**

*– Dreams by Subrahmanyam*



## అంకితం

అకారణమైనసూయా ద్వేషాలతో నాపై తోచిన అవాస్తవాల్ని ఇతోధికంగా ఇంతకాలం నుంచి కష్టపడి ప్రచారం చేస్తూ క్షుద్రానందాన్ననుభవిస్తున్న అకర్మకారులకు – అక్షర ద్యూతికులకూ, అళీక పాండిత్యంతో వారి తెలివిని నా ముందు వెలగబెట్టుకుందుకు వెంపర్లాడే అభావులకు, అమిత్రులకు అసమతావాదులైన ఆగర్భ శత్రువులందరికీ, నా స్వభావసిద్ధ మిత్రత్వ శుభాకాంక్షలతో...

"Forgiveness is giveup my right to hate you for hurting me"

## కృతజ్ఞతలు

ఈ కృతిలో ప్రత్యక్షంగా – పరోక్షంగా నాకు సహాయ సహకారాలందించిన సుజన, అమర్, రామ్, ప్రభ, విస్సూ, గౌతమ్, శైలు, సూర్య, గౌరినాయుడు, శ్రవంత్, లోక్‌నాథ్, రవికాంత్, రవిప్రకాష్‌గారికీ, 'స్త్రీ–పురుషుడు' వ్యాసానువాదానికి మూలమైన "Man & Woman" చలం రచన మొదలుకుని వివిధ రచనలు నాకు పంపుతూ తోడ్పడుతున్న బౌద్ధమిత్రులు రవిచంద్‌గారికీ, మలయశ్రీ గారికీ, లోహియా భావజాల అధ్యయనానికి సాయపడిన రావెల సోమయ్యగారికీ, రావిపూడి వెంకటాద్రి గారికీ ఈ రచనను ప్రోత్సహించిన కెమెరా విజయ్‌కుమార్ గారికీ, డా॥ ప్రదీప్‌గారికీ, భానుప్రసాద్‌గారికీ, వెలమాటి సత్యనారాయణగారికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు.



# విషయసూచిక





**"సిద్ధాంతం వ్యక్తిగత, ముఠాస్వార్ధ ప్రయోజనాల సాధనా సామాగ్రిగా మారిపోయినప్పుడు సిద్ధాంతాలకుగాని, సత్యానికి గాని, స్థాయీరూపం లేకుండాపోయి బూటకం ప్రబలడం ప్రారంభమవుతుంది. భారతదేశం వంటి భిన్న వృత్తులుగల, అతి పురాతన దేశాన్ని సమైక్యంగా ఉంచగలిగేది సిద్ధాంతమూ - సత్యమే. బూటకం, కాఠిన్యాలు దీన్ని మరింత ముక్కలు ముక్కలు చేస్తాయి..... ఈనాడు భారతదేశంలో సాగుతున్న సిద్ధాంత చర్చలన్నీ వట్టి గప్పాలేనని నా అభిప్రాయం."**

– డా॥ రామ్‌మనోహర్ లోహియా



# బౌద్ధ పునరుజ్జీవనోద్యమం - భావోద్యమాల బాధ్యత

"A history of materialism in India is a history of Brahmanism. It is also a history of the social conditions which gave birth to brahminism, a history of the class domination of the Brahmin class. It is a history of oppression and ganeral reaction all round. In short it is a history of the social question in India."

– K.B. Krishna, Page - 10
History of Hindu Materialism

వర్తమాన సమాజంలో ఒక వ్యక్తి స్వతంత్రంగా జీవించడానికి, స్వేచ్ఛగా ప్రశ్నించడానికీ అవసరమయిన ఆరోగ్యకర వాతావరణం కుట్రపూరితంగా ధ్వంసం చేయబడుతోంటే, దుర్మార్గమయిన మౌనాన్ని స్వచ్ఛందంగా పాటిస్తూ స్తబ్దంగా బతుకీడ్చడమే, సుకుమారంతో నాగరికంగా జీవించడంగా భ్రమించే స్థితిలో మనమున్నాం. బాల్యం నుంచే మానసిక వివక్షల్ని పెంపొందించే భయంకరమైన ప్రమాదకర భావజాలం భక్తి విశ్వాసాల పేరుతో ప్రవేశపెట్టబడుతోంటే, నిత్యం దోచుకోబడుతున్న అణగారిన ప్రజలకి సంబంధించిన కఠోరమైన నిజాల గురించిన కనీస స్పృహను కావాలని కోల్పోడమే గుర్తించదగిన ఆధునిక విలువగా చెలామణీ అవుతోంది.

మతాలకి వ్యతిరేకంగా తలెత్తిన నాస్తిక హేతువాద లౌకికశక్తులన్నీ మూసభావాలకి దాసోహమయి కొద్దిమంది భట్రాజులతో కూడిన మూకలుగా, అకారణంగా మతాలన్నిట్నీ దూషించడమే పనిగా పెట్టుకొన్న ముఠాలుగా మిగిలిపోయాయి. తత్వశాస్త్రమంటే తైతక్కల మేళమూ, స్వేచ్ఛంటే గచ్చకాయలాట కాదనే స్పృహలేని మనస్తత్వాలన్నీ అవ్యవస్థీకృతమైన అవిశ్వాసాన్ని ఆడంబరంగా ప్రదర్శించుకోవడమే ఉద్యమ కార్యాచరణనే భ్రమలో వున్నాయి కాన దేవుడున్నాడనే మొండి భావన ఎంత దుందుడుకుగా వ్యవహరించి ఆస్తికత్వాన్ని కాపాడుకో చూస్తోందో, దేవుడు లేడనే పిడివాదాన్ని అంత గిడసబారిగా ప్రచారం చేస్తూ నాస్తికత్వ సాంప్రదాయాన్ని నిలబెట్టుకో యత్నిస్తుంది. మంత్రతంత్రాలతో నిండిన మతమూ, శుద్ధ యంత్రవాదంతో కూడిన భౌతికత్వమూ మానవాళికి రెండూ ప్రమాదకరమే.

మానవీయ దృష్టిలేని వైజ్ఞానిక కృషి అదెంత అద్వితీయమయినదైనా వివేకశూన్యతకు కారణమవుతుంది. వివేచనలేని శాస్త్ర పరిజ్ఞానం వినిమయత్వానికి దారితీసి వ్యవస్థలో కొద్దిమందికి లాభిస్తుందే కాని సార్వత్రిక విలువను సంతరించు కోదు. సత్యాన్వేషణా తృష్ణ లోపించిన అవాస్తవిక వైఖరి శుద్ధ నాస్తికత్వానికి నాంది పలికి యాంత్రిక హేతువాదానికి ధాతువవుతుందేగానీ బౌద్ధిక భౌతికవాదానికి కాదు. బహుశా అందువలనే మొదట్నుంచీ ఆధిపత్య భావజాలం గల అసమతా మతాల్ని ఎదిరించడంలో నాస్తిక హేతువాదులందరూ సైద్ధాంతికంగా కూడా అపజయం పాలవుతూ వచ్చారు. మానవీయ కోణాన్ని కొత్తగా ప్రవేశపెట్టిన 'బౌద్ధం' సమతా సమాజ లక్ష్యాన్ని కొంతమేరకైనా ఎలా సాధించగలిగిందనే విషయాన్ని నిజాయితీగా అధ్యయనం చేయకుండా ఊతపదాలతోనూ, ఉత్తుత్తి కార్యక్రమాలతోనూ కాలయాపన చేయటం అస్తిత్వం నిరూపించుకోడానికైతే సరే కానీ చైతన్య భావజాలాన్ని వ్యాపింపజేయడం కోసం మాత్రం సరిగాదు.

# 2

"It is always easier to see the illusions in one's neighbor's eyes than the delusions in one's own." – Ivan Illich, Page - 16 Celebration of Awareness

కుల నిర్మూలనోద్యమాలుగా సంఘటితమయిన సంస్థలే వాటికవి ప్రత్యేక కులాలకి చెందిన స్వార్ధ సమూహాలుగా రూపొందిన సంఘటనలకివాళ కొదవలేదు. వామపక్ష సంఘాలు మొదలుకొని అనేక అస్తిత్వోద్యమాల్లో ఆచరణనేది లాభనష్టాలు బేరీజు వేసుకుందుకు పనికొచ్చే అధికారిక లావాదేవీగా చూడ్డం జరుగుతోంది తప్పా మరొకరకంగా కాదు. నిబద్ధత గల భావోద్యమాలకి నిజాయితీతో కూడిన కార్యాచరణే ప్రధానం కానీ నిర్దిష్టమయిన సిద్ధాంతాల్తోను, నిష్ప్రయోజనమైన రాద్ధాంతాల్తోను దానికి పన్లేదు. దళిత, బహుజన, స్త్రీ, గిరిజన, పర్యావరణ కాలుష్యానికి సంబంధించిన అన్యాయాల్ని ప్రశ్నించకుండా బండి లాగడం వలన భావోద్యమాలకి తెల్లారదు.

ముఖ్యంగా భారతీయ సమాజంలోని అసమానతలకి మౌలిక ప్రాతిపదికగా చూడబడుతున్న 'కులాన్ని' పట్టించుకోకుండా, కులంపై బహుముఖ పోరాటాలతో కూడిన నిర్మూలనోద్యమ కార్యక్రమాల్ని నిర్మాణాత్మకంగా అమలు చేయకుండా పైపైకి చేపట్టే కంటితుడుపు చేష్టలన్నీ అంతిమంగా అగ్రవర్ణ కులాధిపత్యాన్ని అంతర్లీనంగా



పెంచిపోషించేందుకుపయోగపడతాయే గాని ఇంకెందుకూ కాదు. "There is perhaps no other issue on which we are such hypocrites as caste" అన్న బాలగోపాల్, "Caste will undoubtedly be the last of the iniquitous institutions to die out in this country. It'll outlast everything else." అంటాడు. కులం విషయంలో కళ్లుండీ గుడ్డివాళ్ళైపోయిన కుహనా మేధావుల నుంచీ, అవాంఛనీయమైన ఈ ధోరణి సమాజాన్ని ఎంతకాలం నిద్రపుచ్చుతుందనే నిజాన్ని గ్రహించకల విజ్ఞులు సైతం ప్రయత్నపూర్వక మౌనాన్ని పాటించడంలో తలమునకలయిపోయారు కాబట్టి మేధోవంతమయన సాంఘిక సమైక్యత మాత్రమే ఆశాజన దృక్పధంగా ఆశించడానిక్కావల్సిన అంగీకృత వాతావరణం అప్రయత్నంగానే అమలవుతోంది.

మనిషి అభ్యున్నతికి వాదాలు వాదనలెంత ముఖ్యమో, సాధ్యాలు సాధనాలు కూడా అంతే ముఖ్యమనే ఎరుకలేని ఎరువు సరుకులంతా తోచిన పేచీ పెట్టుకుని వచ్చింది వల్లె వేసుకుంటున్నారు తప్పితే రాన్దేమైనా వుందేమోనని తరచి చూస్కోడంలో ఇంకా వెనకబడే ఉన్నారు. అందుకే 'బౌద్ధం' వంటి మానవవాద మతాన్ని కూడా పురోగామి మార్గంగాచూడలేక తిరోగమిస్తున్నారు. ప్రముఖ బౌద్ధ దార్శనికుడైన రాహుల్ సాంకృత్యాయన్ అంబేద్కర్ బౌద్ధదీక్షను సమర్ధిస్తూ రాసిన 'నవదీక్షిత్ బౌద్ధుల'నే వ్యాసాన్ని డా॥ మలయశ్రీ గారిచేత తెలుగు చేయించి ప్రచురించిన రవిచంద్‌గారు దానికి ముందు మాట రాస్తూ, "భౌతికవాదులకూ, ఆర్ధికవాదులకూ కులరహిత, దైవేతర మానవవాద మతం – బౌద్ధం పునరుద్ధరించబడటం వల్ల కలిగే ప్రయోజనం అంత తేలిగ్గా అర్ధం కాదంటూ, మన దేశంలో తాత్విక, విజ్ఞానశాస్త్రపరమైన చర్చలెప్పుడూ కుస్తీ పోటీల్లా జరుగుతుంటాయనీ, అసలు సమస్య మరుగున పడుతుందం"టారు.

# 3

"The long process of the development of naturalist, rationalist, skeptic, agnostic and materialist thought in Ancient India found culmination in the charvak system of philosophy, which can be compared with Greek Epicureanism, and as such is to be appreciated as the positive outcome of the intellectual culture of India."

– **M.N.Roy,** Materialism, 3rd chapter.

ఏ మతానికా మతం అది మతం కాదు మార్గమని చెప్పుకున్నట్లే, ఏ వాదానికావాదం నాది వాదం కాదు, సాధనా విధానమనే అంటుంది. ఆధిపత్యాలకి అలవాటుపడ్డవార్కి అహంకారం అణుకువగా అనిపించడంలోనూ, ఆతిధ్యాలకి కలబడేవార్కి పాండిత్యం సత్యాన్వేషణగా కనిపించడంలోనూ, ఆశ్చర్యపడాల్సిందేం లేదు కానీ అదంతా నిజంగా తమ గొప్పతనమే ననుకునేవారి అమాయకత్వానికి మట్టుకు జాలిపడాలి. ఒకప్పుడు బుద్ధుడు కోశాంబియనుగ్రామంలో “రాగరాగిణి” అనే విహారంలో వుంటుండగా ఒకానొక బ్రహ్మచారి ఎల్లప్పుడూ చేతితో కాగడా పట్టుకుని తిరుగుతుండేవాడట. అదెందుకనడిగితే, “ప్రపంచమంతా అంధకారంలో వుంది. ప్రజానీకమంతా అజ్ఞానంతో ఎటూ తోచని స్థితిలో కొట్టుమిట్టాడుతున్నారు. అందుకే వారికి వెలుగు చూపేందుకే ‘ఈ కాగడా’ అంటూ అతిశయించేవాడట. దానికి బుద్ధుడు, “ఒకడు వివేకవంతుడు కావచ్చు, కాకపోనూవచ్చు కానీ తనకే సమస్తమూ తెలుసునన్న గర్వంతో ఇతరులను కించపరచబూనడం ఒక గుడ్డివాడు చేతిలో దీపముంచుకుని ఇతరులకు దారి చూపుతాననడం వంటిదే” నంటాడు. “బుద్ధుడు చారిత్రక వ్యక్తి కాదం”టూ శ్రీ ఈశ్వర ప్రభువనే ఆయన చేసిన ఛాలెంజి రచన చూసిన నాకదే అన్పించింది. ఒకప్పుడు హేతువాద విజ్ఞానవేత్తలు చేసినిలాంటి సవాళ్ళు నేడు మతోన్మాదులు చేస్తున్నారంటే విద్యకు – ప్రజ్ఞకు తేడాతెలీని ప్రస్తుత భావోద్యమ బాపతుకిది యధాతథంగా వర్తిస్తుంది.

తోటివారిపై వీలైనంత విద్వేషాన్ని పెంచుకోడమే సాటిలేని దేశభక్తిగా చూడబడే దేశంలో లౌకికవాద తాత్విక భూమికతో కూడిన దక్షతవసరం. అలాంటప్పుడు భావోద్యమాలనేవి మానవికమయిన ఉన్నత వ్యవస్థను రూపొందించే సాధనలో బాధ్యతగా భాగం కావడం కోసం ప్రయత్నించాలేకానీ అతీతశక్తుల్ని ఖండించడం తోనో, అమ్మల్ని–స్వాముల్ని బెదిరించడంతోనో పనైపోయిందని సరిపెట్టుకోకూడదు. ఈ వైఖరి లేని వాదాలెక్కువ కాలం మనలేవు. “సమసమాజాన్ని భౌతిక జీవితశక్తుల పరిణితితో చారిత్రకంగా ముడిపడున్న చైతన్యవంతమైన ఆకాంక్షగా కాక భౌతిక పరిస్థితుల నుండి కొన్ని వర్గాలలో అనివార్యంగా పుట్టే అసంకల్పిత ఆకాంక్షగా అర్థం చేసుకోవడం మార్క్సిజం కాలక్రమంలో మొరటుబారడానికి గల అనేక కారణాలలో ఒకటి” అన్న బాలగోపాల్ మాటలు అన్ని సిద్ధాంతాలకీ సమానంగానే వర్తిస్తాయనడంలో సందేహాలక్కర్లేదు.



ఈరోజు భావోద్యమ క్షేత్రాల్లో లోపించిన దార్శనికతని గూర్చిన సంవాదానికి చోటు కల్పించకుండా వుండటం వల్లనే తమని తాము మహామేధావులుగా భావించుకునే నేలబారు గ్రహాలంతా దండోరాలేసుకుంటూ ఎగిరెగిరి పడుతోంటే, నిజంగా కొద్దోగొప్పో బుద్ధికలవారంతా వ్యవస్థకి బద్ధులై వుంటూ ఒద్దిక పెద్దరికానికి చిహ్నమని సర్దుకుపోయి బతకడం నేర్చుకుంటున్నారు. మూఢ విశ్వాసాలతో కూడిన అలౌకికమైన మతాలకంటే అవిశ్వాసంతో కూడిన లౌకికమార్గం అనుసరణీయం. మోసం, దోపిడీ, అజ్ఞానంతో నిండిన ఈనాటి మతాలకి ప్రత్యామ్నాయంగా కేవలం మానసిక ప్రశాంతతతో కూడిన శాంతియుత జీవన విధానం గల మానవీయమైన నూతన మతాన్ని ఏర్పర్చుకోవడం వల్లా, సాంఘిక జీవితంతో సంబంధంలేని వ్యక్తిగత నైతిక దృక్పథంగా మతాన్ని పాటించినందువల్లా వ్యవస్థకేం నష్టం లేదు.

# 4

"The rationalist society operates by the seven principles of rationalism, humanism, atheism, democracy & Secularism, Gender equality, abolition of caste discrimination and human dignity."

– Manifesto of Gujrat Mumbai rationalist Association

‘విప్లవకారులకే విప్లవకారుడైన’ రామ్‌మనోహర్ లోహియా ప్రతిపాదించిన ‘సప్తక్రాంతి’తో పోల్చదగిన ఈ రకమైన సమాజాన్ని సాధించుకోడానికి మించిన పరమలక్ష్యమేదీ ఏ భావోద్యమానికీ వుండదు. నాస్తిక, హేతువాదోద్యమాలు కూడా ఇందుకు మినహాయింపు కావు. భారతీయ సమాజంలోని ముఖ్యమైన అసమానతలకి ద్వారబంధంగానున్న ‘కులాన్ని’ నిర్మూలించకుండా, మతాన్ని తిట్టడం వల్ల ప్రయోజనం లేదు. ఈ విషయంలో మనకి దేశీయ తత్వవేత్తలైన బుద్ధుడు, కబీర్, నానక్, పి. లక్ష్మీ నరసు, కె.బి. కృష్ణ, జె.పి., లోహియా, పూలే, పెరియార్, నారాయణగురు, అంబేద్కర్‌ల అధ్యయనం ఉపకరించినంతగా విదేశీ విజ్ఞానవేత్తల పరిజ్ఞానం ఉపకరిస్తుందనే భరోసా లేదు. అయితే, ఆ దిశగా ప్రయత్నం చేయడం కూడా మంచిదే. "Religion is not the root of all evil, for no one thing is the root of all anything" అంటాడు. Richard Dawkins, 'The God Delusion' (దేవుడి భ్రమలో) అనే తన గ్రంథంలో.

మత విద్వేషం పరమతస్తులకి సంబంధించి ఎలాంటి వంచిత భావాల్ని ప్రచారం చేస్తోందో, మతాలపై మన ద్వేషం కూడా మతస్తుల గురించి సంకుచిత భావాల్ని అలాగే ప్రచారం చేస్తున్నందువల్లే సమాజంలో లౌకిక మతాభిమానుల కంటే అలౌకిక మతోన్మాదుల సంఖ్య పెరుగుతోంది. ఉన్మాదంతో కూడిన ఉగ్రవాదం కన్నా ఉన్నతమైన విలువలు గల మతం అదేదయినా ఆహ్వానించడం మంచిదేనన్న ఇంగితం నాస్తిక హేతువాదులకి రానంతకాలం అమానవీయమైన ద్వేషపూరిత మతాలే వృద్ధి చెందుతుంటాయి. “మన రాష్ట్రంలో ఉన్న హేతువాద నాస్తిక సంఘాలు ముఠా రాజకీయాలకి పరిమితం అవటం చేతనే ఏం చేయలేకపోతున్నాయం”టూ ఆవేదన వెలిబుచ్చుతాడు పింగళి దశరధరామ్ ‘బాలయోగి బండారం’ అనే తన రచనలో. ఈనాటికీ పరిస్థితిలో మార్పొచ్చినట్లు కనబడట్లేదు. పైగా మైనారిటీల్నీ, స్త్రీలనీ మరింతగా అణిచేయడం జరుగుతోంది. ఇదెంత దారుణంగా కొనసాగుతోందంటే "Muslims had become the new untouchables in India" అనే సచార్ కమిటీ రిపోర్టుని విశ్లేషిస్తారు. ‘మీరా నందా’ అనే రచయిత 'The God Market' (How globalization is making India more Hindu) (భగవంతుడి బజారు) అనే తన పరిశోధనాత్మక గ్రంథంలో. అలాగే, "If the sensitive amongst the people are unable to find answers in real life, they will once again seek solace in religion and spiritualism" అంటాడు కోబాడ్ గాంధీ 'Questions of freedom and people's Emancipation' అనే తన తాత్విక సైద్ధాంతిక వ్యాసంలో.

భావోద్యమాలన్నీ విస్తృతమైన వాటి పరిధిని పెంచుకోవాల్సిన అవసరం ఈరోజు మరింతగా వుంది. వర్తమాన రాజకీయార్థిక నాటకాలకి సంబంధించిన నిజ విశ్లేషణల్నీ, భక్తిమత విశ్వాసాల్లోంచి జనించిన వైమనస్య దోపిడీని, ఆధునికత పేరిత వ్యవస్థనాక్రమించుకున్న వినిమయదారీ బానిసత్వాన్ని తుదముట్టించడం కోసం ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక సమానత్వంతోబాటూ హార్దిక, మానసిక, మానవిక సామరస్యాన్ని ప్రసాదించే నూతన ఆత్మిక విధానాన్వేషణ అవసరమని నా భావన. అందుకోసం నిర్మాణాత్మకమయిన ప్రజాతంత్ర ప్రత్యామ్నాయ మార్గాల్ని అభివృద్ధి చేసుకోవాలి. "In a country which had accepted caste distinctions for many centuries, inequality had become an inborn mental concept." అంటాడు కుష్వంత్ సింగ్, ‘ట్రైన్ టు పాకిస్తాన్’ నవల్లో.



# 5

"We shall require a sustantially new manner of thinking if mankind is to survive." – *Albert Einstein,* Why Socialism?

ఇక యిప్పుడు బౌద్ధాన్ని క్రొత్తగా ప్రతిపాదించాల్సిన అవసరమేముందనే విషయంలో కొత్త వివాదాలకు తెరతీయడం నా ఉద్దేశం కాదు కానీ బౌద్ధం విషయంలో మతతత్వ శక్తుల్లాగానే విమతశక్తులు కూడా మౌనం దాల్చడంలో అర్థం లేదని మాత్రమే నా అభియోగమూ, అభిప్రాయమూనూ. “పండితః పండితం దృష్ట్వా శ్వానవత్ ఘుర్ఘురాయత్” (కుక్కల్లాగా పండితులకి కూడా జ్ఞాతి వైరం సహజం) అనే సాంప్రదాయ భావనను నిజం చేసేలా ఇప్పటికీ ప్రవర్తించడం విజ్ఞతకి భావ్యమూ కాదు, న్యాయమూ కాదు. అందుకే బలమయిన ఐక్య సంఘంగా మారి ముందుకెళ్ళాల్సిన సమయమొచ్చింది. అలా వచ్చిందని గుర్తించడమే ఈ వ్యాస రచనకి ప్రేరణ. “కమ్యూనిజంలో వుండే గొప్ప శక్తి ఏమిటంటే, ఏ విషయాన్నైనా సరే, ఆరోగ్యము, విద్య, ఆర్థిక విధానమూ, దేవుడు, నీతి దేనినైనా సరే పాత బూజుల్ని దులిపి ఈనాటి ప్రజా క్షేమపు దృష్టితో చూడగలగడం. పెద్ద బలహీనత ఏంటంటే, కమ్యూనిజం సిద్ధాంతంలోంచి తప్పు దేనినీ చూడలేకపోవడం, దానికి విరుద్ధమైన దాంట్లో సత్యం కనపడకపోవడం.” అన్న చలం మాటలు ఈనాటి భౌతికవాదానికి కూడా సరిపోతాయి.

“భారతదేశంలోనైతే తాత్విక దృక్పథం అనేది ఉందా అని అనుమానించాలి. తాత్విక దృక్పథం గురించీ చర్చల గురించీ ఆలోచిస్తే గౌతమబుద్ధుడు మినహా మరొకరెవరూ తాత్విక విషయాలు చర్చించనేలేదు… భారతదేశంలో మొదటి, చివరి తత్వవేత్త బుద్ధుడేననుకుంటా” నంటాడు కన్నబిరాన్ ‘24 గంటల’నే తన ఆత్మకథలో. జ్ఞానజ్ఞాన విచక్షణ విమత విధానానికీ, విశ్వాస విమోచనకీ కాక ఒక తరహా సాంఘిక స్తబ్దతకి కారణమవుతోందేమో, మానసిక సంఘర్షణని పక్వం చేయాల్సిన పరిస్థితులన్నీ ఆధునిక విలాసాల మాయలోపడి అదృశ్యమైపోగా మనిషి సొంతంగా యోచించడాని క్కావలసిన జిజ్ఞాసాత్మక సాధనాలన్నీ మతంతో సంకరమయ్యి అనుస్యూతమయిన అంధకారాన్ని ఆధ్యాత్మికత పేరిట ఆరాధిస్తున్నప్పుడు అహేతుకమైన ఆచారాలతో కూడిన అలౌకిక మతాలకంటే కూడా, హేతుబద్ధమయిన ఆచరణకి ప్రాధాన్యతనిచ్చే ప్రేమ పూర్వక, కరుణాత్మక, మానవవాద బౌద్ధిక మతాల్నవలంబించడం మంచిదనిపించడం వల్లే ఈ పక్షాన్ని తీసుకోవాలని నా భావం.

"Our problem is, in fact, to fit the world to our perceptions, and not our perceptions to the world" అంటాడు. A.N. Whitehead. ఆ జ్ఞానం లోపించిన మనసు అజ్ఞానాన్ని వెంబడించడానికిష్టపడుతుంది తప్పితే వాస్తవాల్ని తెల్సుకుందుకు కాదు. ఎంతో కొంత అస్తిత్వోద్యమాలతో మిళితం కాకుండా, జరుగుతున్న సమకాలీన సాంఘికోద్యమాలతో ఏ మాత్రం ప్రమేయం లేకుండా భావోద్యమాలనేవెప్పటికీ సరైన బాట పట్టలేవు. "సిద్ధాంతాలు పట్టని వారికి మిగిలేవి దైనందిన చర్యలు. అవి బ్రతకడానికక్కరకొస్తాయేమోకాని జీవించడానిక్కాదంటా"డు రామ్ మనోహర్ లోహియా. ఎమ్.ఎన్. రాయ్ తత్వశాస్త్రాన్ని 'విజ్ఞాన శాస్త్రాలకే విజ్ఞాన శాస్త్రం' (Philosophy is called the Science of Sciences) అన్నాడు. అలాంటి గొప్ప తాత్విక ధర్మమైన బౌద్ధం భారతదేశంలో అణగద్రొక్కబడటాన్ని "మన పూర్వీకులు చేసిన అతి పెద్ద పాపం"గా (Monumental sin of our forefathers) గా రాయ్ అభివర్ణిస్తే, "ఏనాడైతే బౌద్ధం భారతదేశంలో అణగద్రొక్కబడిందో ఆనాడే భారతదేశం మతపరంగా ఆత్మహత్య చేసుకొంది" (India committed religious suicide) అని మహాకవి గురజాడ వ్యాఖ్యానించాడు. కాన ఇప్పటికైనా బౌద్ధాన్ని పునరుజ్జీవింపజేయడానికి జరుగుతున్న ప్రయత్నాల్లో భావోద్యమకారులు సైతం పాలుపంచుకోవడం వారి బాధ్యత.

**కొన్ని సంప్రదిత గ్రంథాలు :**


1) Studies in Hindu Materialism by K.B. Krishna, Published by T. Ravi chand, Milinda Publications, Guntur, Dec-18, 1994.

2) Celebration of Awareness, (A call for institutional Revolution) By Ivan Illich, Published in hardcover by Doubleday and company, Anchor Books edition 1971.

3) Ear to the ground, (Selected writings on class and caste) By K. Balagopal, Navayana Publishing, New Delhi 2011.

4) నవదీక్షిత బౌద్ధులు, హిందీ – రాహుల్ సాంకృత్యాయన్, తెలుగు – మలయశ్రీ, సంపాదకత్వం – టి. రవిచంద్, మిళింద ప్రచురణలు, గుంటూరు, 2002.

5) బుద్ధుడు మరియు అతని ధమ్మం, రచన – అంబేద్కర్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణలు, 11వ సంపుటం, 1994.





6) మనిషి – మార్క్సిజం, కె. బాలగోపాల్, పర్‌స్పెక్టివ్స్, హైద్రాబాద్, 2012

7) క్రాంతదర్శి లోహియా, లోహియా శతజయంతి సమితి ప్రచురణ, ప్రథమ ముద్రణ అక్టోబర్ 2009.

8) The questions of freedom and people's Emancipation, By Kobad Gandhi, Article Serially published in 'Mainstream' in 2012, source : internet.

9) The God Market (How globalization is making India more Hindu) By Meera Nanda, Random Publishing House, India - 2009.

10) Train to Pakistan, By Khushwant Singh, Published in Times Books International, New Delhi - 1989.

11) Why Socialism? By Albert Einstein, Published Jana Vignana Vedika, AP Chapter, August - 2012.

12) The Aims of Education and Other Essays, By Alfred North Whitehead, A Mentor Book Published by The New American Library, Newyork - 1958.

13) బాలయోగి బండారం, పింగళి దశరథరామ్, చైతన్య బుక్స్, విజయవాడ, జూలై 1983.

14) గురజాడ జీవితంలో బౌద్ధం (చారిత్రాత్మక గురజాడ లేఖకు వందేళ్ళు) టి. రవిచంద్, మిళింద ప్రచురణలు, బాపట్ల–2012

15) 24 గంటలు, కన్నబిరాన్ ఆత్మకథ, దేవులపల్లి పబ్లికేషన్స్, హైదరాబాద్, జనవరి – 2010.

16) 'హేతువాది' పత్రిక సంచికలు, సంపాదకులు – రావిపూడి వెంకటాద్రి, చీరాల, ప్రకాశం జిల్లా.

17) 'బుద్ధుడు చారిత్రక వ్యక్తి కాడు' రచన–ఈశ్వర ప్రభు, హేతువాద విజ్ఞాన కేంద్రం ప్రచురణ, విజయవాడ–1983

# కుల గర్వం - మత మర్మం - బౌద్ధ ధర్మం

"Rather than love, than money, than fame, give me truth...."

– Henry David Thoreau

ఈ దేశంలో పుట్టిన విప్లవాలు – ఉద్యమాలు అన్నీ బ్రాహ్మణిజం బారి నుండి తప్పించుకోలేకపోయాయనే నిజం, కులవ్యతిరేకోద్యమాలు, కుల నిర్మూలనోద్యమాలు ప్రత్యేక కులంగా పాటించబడుతున్న పరిస్థితుల్ని అర్థం చేసుకుంటే కాని తెలీదు. కుల భావనని మేథోజనితమయిన శక్తివంత మానసిక వివక్షా దృక్పథంగా కాక, ఆర్థిక – సాంఘిక – సాంస్కృతిక లక్షణంగా నిర్వచించుకొని ఏదోక సిద్ధాంతానికి దాన్ని అన్వయించుకుని తమని తామే మానసికంగా వంచించుకుంటున్న సంకుచిత మనస్తత్వాలు పెంపొందుతున్నంతకాలం సమాజంలోని అన్ని ప్రధాన విభాగాల్లో 'కులం' తన ప్రభావశీలమైన పాత్రను ప్రమాదకరంగా పోషిస్తూనే వుంటుంది.

కాల్పనిక ఉద్యమ సార్వత్రికత్వాన్ని బోధించే విప్లవకారులు, దైనందిన జీవితాల్లో అనుక్షణం కనిపిస్తున్న అసమానతలపట్లా, అమలవుతున్న అంటరానితనం పట్లా దుర్మార్గమయిన మౌనం పాటిస్తూ ఎందుకు ఉదాసీనంగా వ్యవహరిస్తున్నారనే ప్రశ్నకి సమాధానం నిత్య జీవితంలోని ప్రతిపార్శ్వంలోనూ అప్రయత్నంగానే కులతత్వాన్ని కొలవడానికి అలవాటుపడిన వారి దగాపూరిత హృదయాన్నీ, ధనాశతో కూడిన ఆచరణనీ గమనిస్తే తెలుస్తుంది. "కులాలను గురించి మాట్లాడటం మానివేయడమంటే, భారతదేశపు పరిస్థితికి చెందిన, అన్నిటికన్నా ప్రధానమైన ఏకైక అంశం పట్ల కండ్లు మూసుకోవడమే అవుతుందం"టారు లోహియా.

సమకాలీన సామాజిక వాస్తవికతపట్ల అపరిణితమైన అర్థజ్ఞానం కలిగుండటమే సాంఘిక స్పృహగల చైతన్యస్థాయికి సరైన అర్హతగా చూడబడుతోంటే, కొద్దోగొప్పో కల ఆలోచనాపూర్వకమయిన ఆచరణాత్మక వివేక పక్షం అల్పదృష్టితో వీక్షించబడుతోంది. అందుకే, ఎన్ని ప్రయత్నాలుద్భవించినా కులమనే హాలాహలం ఈనాటికీ అన్నిరకాల ప్రజాశ్రేణుల్లో తన పంథాని నిలబెట్టుకుంటోంది. ఈ రోజుల్లో కులాలెక్కడున్నాయనే కుటిల సూత్రీకరణలు చేసే మే'తా'వులంతా సాధారణంగా ఎంతోకొంత పరిమాణంలో 'కులభావనని' సమర్థిస్తున్నవారే.



సామాజిక స్పృహ కలిగి వున్నవారిలో సైతం అందుకే కుల భావన పూర్తిగా తుడిచిపెట్టుకు పోవట్లేదు. "ప్రతీ ఒక్కరూ ఏదో ఒకకులంలోనే పుట్టక తప్పని మన దేశంలో కులం వల్ల వచ్చే నిరాదరణను వదుల్చుకోవడం సాధ్యం కాదు. ఒక అగ్రవర్ణ వ్యక్తి మరొక మతంలోకి మారినప్పటికీ అతను తన పాత మతంలో తనకన్నా తక్కువస్థాయిలో ఉన్న కులంపైన తాను నెరిపే ఆధిపత్యాన్ని వదులుకోవడానికి సిద్ధపడడు.... సామాజిక ఊర్ధ్వచలనంలో సమానత్వ సూత్రం కేవలం పెదాలపై ఉచ్ఛరింపబడుతుంది. అంతే, కులమే అసలైన నిచ్చెన" అన్న కన్నబిరాన్ మాటలు ఇదే చెబుతున్నాయి.

## 2

"If we don't rebel, if we're not physically in an active rebellion, then it's spiritual death."

– Chris Hedges

కుల నిర్మూలనోద్యమాలని బహుముఖంగా నిర్మించటం కూడా వారి బాధ్యతేనని ప్రగతిశీల సంఘాలు గట్టిగా గుర్తించడానికి దళితులు పాశవిక దాడులకు గురవ్వాల్సొచ్చింది. మామూలుగా అంబేద్కర్‌ని విగ్రహాలకూ, పూలేని పుస్తకాలకూ మాత్రమే పరిమితం చేసుకుని కులతత్వ వ్యతిరేక ప్రతిఘటనోద్యమాలని వారసత్వంగా కొనసాగించడానిగ్గానూ వారధి నిర్మిస్తున్నామనే భ్రమల్లోనున్నవారికి 'సహజాత' స్థాయికెళ్ళిపోయిన 'కులం' సైద్ధాంతిక పోరాటాలతో మాత్రమే కూలదనే విషయం అర్థం కావడానికి ఇంకా సమయం పడుతుందేమో వేచి చూడాలి.

కులం ఈ సరికే ఈ దేశపు ప్రజల్లో జీర్ణించుకుపోయిన బలమయిన మానసిక లక్షణం. వ్యక్తుల్ని అనాలోచిత చట్రంలో ఇరికించడం ద్వారా వ్యవస్థ మొత్తాన్నీ అమానవీయమయిన, అవమానకరమయిన వివేచనా రాహిత్యం దిశగా మళ్ళించడం హైందవ మత లక్ష్యం. దాన్ని నిర్దేశించే మౌలిక ఆయుధం కులం. ఇప్పటిదాకా శుభ్రత, ప్రతిభ, దేవుడు, దెయ్యము, పవిత్రత, ఆచారం, సాంప్రదాయం మొదలైన పదాలతో అత్యధిక శాతం మంది ప్రజల్నీ, వారి సంస్కృతినీ కించపరిచిన సనాతన దొంగలు, అకస్మాత్తుగా నాగరికుల అవతారమెత్తి అదృశ్య మనుధర్మశాస్త్రాన్ని అభివృద్ధి చేసేందుకు ఆధునిక బ్రాహ్మణీయ అంటరానితనాన్ని ప్రపంచీకరణ ప్రతినిధులుగా పెంచిపోషిస్తున్నారు.

"ప్రతీకులం వారి కోసం ఈ వ్యవస్థ ఒక్కొక్క చట్రాన్ని తయారు చేసింది. ఒక్కో కులం వారి విలువలను ఒక్కొక్క కొలబద్ధతో ఈ వ్యవస్థ కొలుస్తూ వచ్చింది. రకరకాల చట్రాలతో బిగింపబడటం వలన మొత్తంగా ఈ సమాజ వ్యవస్థ కుళ్ళిపోయిందనే చెప్పాలి. దీనికి వయస్సు మళ్ళిందనే చెప్పాలి. దరిద్రులు, ఉపేక్షితులు, పుట్టగానే నేరస్తులన్న ముద్ర నొసట వేయబడిన పీడితులు వీళ్ళందరి జీవితాలూ మారేదెప్పుడు? తాము బాగుపడాలని వాళ్ళలో కోరిక ఉన్నా ఈ వ్యవస్థ వాళ్ళను బాగుచెయ్యదు. ఈ వ్యవస్థలో మార్పు రావాలని నా కోరిక. మార్పు వస్తుందో రాదో కాలమే నిర్ణయించా"లంటారు లక్ష్మణ్ గాయక్‌వాడ్ 'ఉచల్యా' అనే అద్భుతమైన తన ఆత్మకథలో.

మనదేశపు మతాలన్నీ అంతర్లీనంగా అగ్రకులాధిపత్యాన్ని పెంచి పోషించడంలో తమవంతు పాత్ర పోషిస్తుండబట్టే, ఈ రోజు కులతత్వం మారుమూల గ్రామాలు, దూరాభార పల్లెల్లో కంటే పట్నాల్లోని ప్రభుత్వ కార్యాలయాల్లోనూ, నగరాల్లోని ప్రైవేటు కంపెనీల్లోనూ ఎక్కువగా కనిపిస్తోంది. గమనించాల్సిన మరో చేదు నిజమేమంటే మూఢభక్తి విశ్వాసాలతో కూడిన మతతత్వం, మూర్ఖ వివక్షాకుయుక్తితో కూడిన కులతత్వం నిరక్షరాస్యులైన జనాల్లోకంటే అక్షరాస్యులైన విద్యావంతుల్లోనే వేగంగా వ్యాపిస్తున్నాయి. ఈరోజు దేశం చదువుకున్న మూర్ఖుల చేతిలోపడి నాశనమైపోతోంది.

ఎవరికి వారే విద్యావంతులమనే భ్రమల్లో మునిగితేలుతున్న సమాజంలో అంతిమంగా అవిద్యని ఆరాధించడం మొదలవుతుంది. ఆఖరుకది ఆలోచనాస్తబ్దతకీ, ఆచరణాసన్యాసానికీ కారణమయ్యి వ్యవస్థ మొత్తాన్ని ఉదాసీన స్థితికి తీసికెళ్ళ గలుగుతుందే కానీ ఏ విధమైన ఉద్యమ చైతన్యాన్నీ నింపలేదు. అందుకే "ఈనాడు భారతదేశంలో ఉన్నటువంటి అనేకమైన లోపాలలో ఆలోచనలు స్తంభించి పోవడమన్నది కూడా ఒక లోపమని నా అభిప్రాయం. మేథస్సు చచ్చిపోయింది. దాన్ని పునరుజ్జీవింపచెయ్యాలం"టాడు లోహియా. ప్రజా ఉద్యమ క్షేత్రాలన్నీ ముందీ విషయాన్ని గుర్తించాలి.

# 3

"We can have facts without thinking but we cannot have thinking without facts."
– John Dewey



ప్రగతిశీలోద్యమాల సంగతి ప్రస్తావించుకుంటున్నప్పుడు భావోద్యమాలైన లౌకికోద్యమాల గూర్చి పరిశీలించాలి. నాస్తిక, హేతువాద, వామపక్ష సంస్థల్లో సైతం 'కులం' ప్రధాన ద్వారమౌతోందనే విమర్శని నిష్పక్షపాతంగా స్వీకరించి చూడాలి. నిబద్ధత కల నాయకత్వానికీ, నిజాయితీగల కార్యకర్తలకీ కూడా అసూయతో కులాన్నంటకట్టే కుహనా ధోరణిని కనిపెట్టడంలో విఫలమైతే అభ్యుదయ గమనం కుంటుపడుతుంది. కాబట్టి, మౌనమైన కార్యాచరణని జలగలు చేసే జంగిలి తర్కంతో నిరాధారంగా సందేహించడం సమాజానికి ఆరోగ్యకరం కాదు. వైఖరికీ, వంచనకి వ్యత్యాసం తెలియడం అవసరం.

"హేతువాదం అంటే మనిషి కేవలం తెలివితేటలతో ఆలోచించి తన కవసరమైనదాన్ని పొందడం కాదు. ఒక దొంగ కూడా తన తెలివిని (అంటే హేతువుని) ఉపయోగించి తన పనిని చేసుకోవచ్చు. ఐతే, ఆ దొంగ తన పనిలోని మంచి చెడ్డలను నిర్ణయించటానికి హేతువును ఉపయోగించడమే హేతువాదం పనిచేయడ" మంటాడు వి.యం. తార్కుండే, 'ప్రజా జీవితంలో దిగజారుతున్న నైతిక ప్రమాణాల'నే సి.బి. గుప్తా స్మారకోపన్యాసంలో. హేతుబుద్ధికీ, నైతికతకీ వుండే సంబంధాన్ని గూర్చి ఇందులోనే ప్రసిద్ధ సామాజిక శాస్త్రవేత్త మోరిన్ గిన్స్‌బర్గ్ మాటలైన "చరిత్రలో మనిషి క్రమంగా హేతుమంతుడవుతున్నాడు, హేతువంతుడౌతున్న మేరకు నీతిమంతుడౌతున్నాడనేదే అభ్యుదయ సిద్ధాంతంలోని ప్రధాన విషయ వాస్తవమని నా అభిప్రాయ"మనేది కూడా ఉటంకించారాయన.

కులతత్వాన్ని స్వల్ప విషయంగా మాత్రమే జమకట్టిన మిత్రులంతా యిప్పటికైనా నిజాల్ని పట్టించుకునే పని పెట్టుకుంటే మంచిదనే భావన భావోద్యమాల్ని తరచి చూస్తున్న ఆలోచనాపరుల్లో ఊరికే తలెత్తింది కాదు. అస్తిత్వోద్యమాల ముసుగులో అభివృద్ధవుతున్న అగ్రవర్ణ అలవాట్లని గమనిస్తే కాని అసలు నిజం తెలీదు. శాఖాహారాన్ని తినటంపై కూడా పర్యావరణోద్యమాలతో ముడిపెట్టి ప్రచారం చేసుకునే వెకిలి వ్యక్తిత్వాలకి మాంసాహారులంటేనే ఒక రకమైన మానసిక వికారం ఉంటుంది. దాన్ని సమర్థించుకుందుకు సైన్సు మొదలుకుని చరిత్ర వరకూ వెదుకుతూ వాదాన్ని నిలబెట్టుకుందుకు పడరాని తిప్పలు పడతారు.

సామ్రాజ్యవాద కార్పొరేట్ కనుసన్నల్లో సాగుతున్న మద్య, మాదకద్రవ్య, మీడియా దోపిడీని అశాస్త్రీయంగా బలపరిచేందుకు మాంసం తినడం కూడా

అనాగరికమనే వాదనని తెరపైకి తెస్తారు. జంతువులకు దైవత్వాన్నీ, పవిత్రతనీ అంటకట్టే ఈ అంటురోగులకు శతాబ్దాలుగా వాటిని తింటున్న మనుషుల్ని ఊరికి దూరంపెట్టి అస్పృశ్యులుగా, అంటరానివారుగా చూస్తూ, అన్ని రకాలుగా వారిని అణిచివేయడం మాత్రం ఎందుకనో నాగరికంగానే అనిపిస్తుంది. మాంసభక్షణ వల్ల మనిషిలో క్రూరత్వం పెరుగుతుందనీ, సాత్వికాహారమే ఆరోగ్యకరమని వాదించే వారికి చరిత్రలో ఏ వర్గాలు ఆధిపత్యస్థానం వహించి శ్రమజీవులకి తీరని అన్యాయం చేసాయో, ఏ వర్గాలు విద్యనీ, కళల్నీ, జ్ఞానాన్నీ దొంగిలించాయో, ఈనాటికీ దళితులపై దాడులకు పాల్పడుతోందేవర్గాలో, వాటిని నిర్దేశిస్తున్న 'శాఖాహార భావజాలం' ఎంత అన్యాయమైందో తెల్సుకునే తీరికుండదు.

## 4

"In a consumer society there are inevitably two kinds of slaves : the prisoners of addiction and the prisoners of envy." – Ivan Illich.

మాంస భక్షణని మద్యపాన తరహాలో ఎందుకు వ్యతిరేకించరనే ప్రశ్న ఈమధ్య తలెత్తుతోంది. దానికి సరైన జవాబుని వెతికే ప్రయత్నం చేయకుండా ముందుకెళ్ళడమంటే మనల్ని మనం మోసగించుకోవడమే అవుతుంది. ఇతర దేశాల విషయం పక్కనపెడితే ఈ దేశంలో మనుషుల ఆహారం వారి సాంఘికస్థాయితో ముడిపడుంటుంది. అనేక సంచారజాతులు మొదలుకుని దళిత, గిరిజన, ఆదివాసి, బహుజనుల సంస్కృతిలో మాంసాహారం ఒక ప్రధాన భాగం. ఈ విషయాన్నాధారం చేసుకునే అప్పటిదాకా అనేక జీవుల్ని యజ్ఞయాగాల వంకతో, దేవతా బలుల పేరుతో వధించి ఆబగా ఆరగించిన అగ్రవర్ణాలు, జైన బౌద్ధాల భయంతో 'శాఖాహార' నాటకం మొదలుపెట్టి తమకేనాడూ లేని పనికిమాలిన పవిత్రతని అంటకట్టుకున్నాయి.

ఇక అప్పట్నుంచి మాంసహారులందర్నీ క్రూరంగా చిత్రిస్తూ సాత్విక మంత్రాలు వల్లించడం మొదలైంది. నిజానికీ దేశంలో ఆహారాన్ని వ్యక్తిగతాంశంగా చూసే అలవాటు ఎప్పుడూ లేదు. ఆ ప్రాతిపదికపైనే దళిత బహుజనుల్ని అణగదొక్కటం జరిగింది. బ్రాహ్మణీయ వారసత్వాన్ని పుణికిపుచ్చుకున్న నూతన బానిస భావవారసులు ఇదే అంశాన్ని కొత్తగా ప్రవేశపెడుతున్నారు. మాంసాహారాన్ని అసహ్యించుకునే మానసిక ధోరణిని అభివృద్ధి చేయడం వెనుక వాట్ని తినే మనుషుల్ని కూడా



అసహ్యించుకునేలా చేయాలనే కుట్ర వుంది. అదర్థం కాకుండా ఈ ఆహార దౌర్జన్యం (ఫుడ్ ఫాసిజమ్)పై పైపై తీర్పులిచ్చి ఉపయోగం లేదు.

"ఈ దేశంలో పీల్చేగాలికి కులముంది, తాగేనీటికి కులముంది, పారే పంటకాల్వకి, పండే భూమికి కులముంది. బడికి-గుడికి-రచ్చబండకికులముంది, తినే తిండికీ, వుండే ఇంటికీ, కట్టే బట్టకి కులముంది, మాటాడే మాటకి కులముంది, సాహిత్యానికి - సంస్కృతికి కులముంది, రాజ్యానికి కులముంది, దాని చట్టానికీ కులముంది, న్యాయానికీ - న్యాయస్థానానికీ కులముంది, శవానికి, శ్మశాన వాటికకు కులముంది. దేవుడికి కులముంది, దెయ్యానికి కులముంద"న్న కళ్యాణరావు "ఈ దేశం సంస్కృతికి సిగ్గులేదు. ఉన్నదల్లా కుట్ర. ఈ దేశం సంస్కృతికి నిజాయితీ లేదు. ఉన్నదల్లా మోసం. యిక్కడ వేదం, మతం, మనువు, సహనం, సామరస్యం అన్నీ కుట్రకీ, మోసానికీ పర్యాయపదాలం"టారు.

అసమానతలకి పుట్టినిల్లయిన బ్రాహ్మణీయ ఫాసిస్టు తత్వశాస్త్రంలో 'కులాన్ని' తర్కంతో ఎలా సమర్ధించాలనేదే ముఖ్యమైన అంశంగా వుంటుంది. అందుకనే సమాజంలోని అత్యధిక శాతం మందిని మత్తులో ముంచడానికి చూస్తున్న మత విశ్వాసాల్నీ, మద్యమాదక ద్రవ్యాల్నీ సమర్ధిస్తుంటారీ బ్రాహ్మణీయ సంత. "మనుషులు అసలే తాగవచ్చునో, తాగకూడదో, తాగడం సార్వత్రికంగా అభ్యంతరకరం కాదో, ఈ చర్యలు ఎట్లాగున్నా ప్రభుత్వం ప్రజల తాగుడును ఒక ఆదాయ వనరుగా భావించి ఆ అలవాటును తన రెవెన్యూ అవసరాల కోసం వ్యాపింపచేయడం సర్వత్రా అభ్యంతరకరం. ప్రస్తుత సామాజిక పరిస్థితులలో అమానుషం అని ప్రకటించడానికి ఎవరికీ ఇబ్బంది ఉండనక్కర్లేదంటా"డు బాలగోపాల్ 'మద్యపానం-మానవహక్కుల"నే వ్యాసంలో.

## 5

"I wanted movement and not a calm course of existence. I wanted excitement and danger and the chance to sacrifice myself for my love. " – Leo Tolstoy.

సాహసమంటే గెలిచినప్పుడు చంకలు గుద్దుకుని సంబరపడిపోవడం కాదు; వోడిపోయినప్పుడుకూడా వొరిగిపోకుండా నిబ్బరంగా నిలబడగలగడం.

దారుణమయిన వ్యధల్ని సహిస్తూ సైతం వెనకడుగేయకుండా ముందుకెళ్ళగలగడం. భారతీయ సామాజిక వ్యవస్థని నిశితంగా అధ్యయనం చేసిన ప్రతీ ప్రజాతంత్ర తత్వవేత్తా 'కులాన్ని' నిర్మూలించడానికే యత్నించారు. "వందలాది, వేలాది బ్రాహ్మణులు బీదల రక్తం దోచుకున్నారన్న" వివేకానందుడు, "వాళ్ళని తన్ని తరిమేయండం"టూ ప్రజలకి పిలుపునిచ్చాడు. గాంధీ సైతం "అంటరానితనం జీవించుండటంకంటే హిందూ మతం మరణించడం మేల"న్నాడు.

అయితే, అప్పటిదాకా సాగిన కులనిర్మూలనోద్యమ ప్రయత్నాలన్నిటినీ సమూలంగా అధ్యయనం చేసి అందుకోసం ముందుతరాలవారికి శక్తివంతమైన ఆయుధాన్ని అందించినవాడు మాత్రం అంబేద్కర్. లెక్కలేనన్ని తత్వశాస్త్రాల్ని ఔపోశన పట్టిన అతడి మేధోజనిత విజ్ఞానం చివరివరకూ తనని తాను విస్తృతపరుచుకుంటూనే వుంది. "స్థిరత్వం అనేది గాడిద లక్షణమని ఎమర్సన్ అన్నాడు. అలా కావాలనే కోరిక నాకు లేదు. స్థిరత్వం పేరుపై ఒకసారి వ్యక్తపరిచిన భావాలనే పట్టుకొని వేలాడటమన్నది ఆలోచించగల మానవుడెవడూ చేయడు. స్థిరత్వం కంటే ముఖ్యమైనది బాధ్యత. బాధ్యతాయుతమైన మనిషి తన భావాలను పునఃపరిశీలించడంలోనూ, మార్చుకోవడంలోనూ నిర్భయత్వాన్ని కలిగుండాలి. ఆలోచనలకు అంతమనేది లేదంటా"డాయన.

భారతదేశంలోని అసమానతల్ని సమూలంగా నిర్మూలించేందుకు కృషి చేసిన సమగ్ర సమాజవాద దృక్పథం బౌద్ధం. వ్యక్తుల్లోని మానసిక పరిపక్వతపై ఎంతగా దృష్టిపెట్టిందో, వ్యవస్థలోని అమానుష వైఖరుల్ని అంతమొందించడానికీ అంతే కృషి చేసింది. ఉన్నతమైన నైతిక విలువలతో కూడిన మానవీయ స్పృహను ఏర్పర్చుకుని ఆచరణాత్మకమైన జీవన విధానాన్ని అవలంభించడమే ఏ రకమైన ఆశాజన సిద్ధాంతానికైనా ముఖ్యమైన అంశం. బౌద్ధం ఆ పనిని సమగ్రంగా చేసి చూపింది. అందుకనే సాంఘిక విప్లవోద్యమంగా రూపుదాల్చి సామాజిక చైతన్యాన్ని రగిలించ గలిగింది.

అలా రగిలించగలిగింది కనుకనే ప్రపంచంలో వివేకంగా ఆలోచించగలిగిన చింతనాపరులందరి దగ్గరికీ చేరింది. ఈరోజుకీ కూడా కులమతాల రహస్యం అర్థంకాక తలలుపట్టుకుంటున్న సామాజికవేత్తలు ఆనాటి బౌద్ధ ఉద్యమాన్ని గురించి లోతుగా అధ్యయనం చేయకుండా అలసత్వం వహించడం కూడా సాంఘికోద్యమాల్లో



కొనసాగుతున్న లోపమని నేననుకుంటాను. "సామ్యవాద సాహితీవేత్తలు, నాయకులు, భూస్వామ్య ధనాఢ్యవర్గాల నుండి రావడం వల్ల ధనాఢ్యుల, బలవంతుల, భూస్వాముల దౌర్జన్యాలను ఎదుర్కొనలేకపోతున్నారు. ప్రముఖ మార్క్సిస్టు భాష్యకారుడు కొసరిచ్ వేదకాలంనాటి భారతదేశపు గ్రామాల్ని మూఢ గ్రామీణ వాతావరణాన్ని, కులప్రమేయపు కంపును ఇప్పటికీ చూడవచ్చునంటాడం'టారు కత్తి చంద్రయ్య సంగాల కోటేశ్వరరావు 'కిరీటి' నవలకి రాసిన పీఠికలో.

బౌద్ధాన్ని క్రమపద్ధతిలో అర్థం చేసోకోవడమెంత అవసరమో, అక్రమంగా పాటించబడుతున్న దొంగ హైందవీకరణ చెందిన బౌద్ధాన్ని వ్యతిరేకించడం కూడా అంతే అవసరమని గుర్తించడానికి అనుమానాలక్కర్లేదు. "పోరాటం కోసం ఏ సంస్థలైతే పుట్టాయో అవి తర్వాత అడుక్కోడానికి, జయంతులు జరపడానికి, ముఖస్తుతులు చేసుకోడానికి, పొగుడుకోడానికి వ్యక్తిగత స్వార్ధప్రయోజనాలకోసం ఉపయోగపడసాగాయి... సంపద కూడబెట్టడమే అంటరానివాళ్ల లక్ష్యమైపోయింద"న్న భగవాన్‌దాస్, "నీ విముక్తి మతాల్లోకి మారడంలో కాదు వాటి నుంచి బైటపడడంలో ఉందం"టాడు, 'నేను భంగీ'ననే తన స్వీయచరిత్రలో.

# 6

"Buddhism is more a system of philosophy and practical ethics than a religion."
– P. Lakshmi Narasu

ప్రపంచంలోని అన్ని మతాలు విశ్వాసం ప్రాతిపదికగా జనిస్తే బౌద్ధం మాత్రం అవిశ్వాసాన్ని ఆధారం చేసుకుని ఆవిర్భవించింది. నైతికతలేని భౌతికవాదం నైచ్యానికి దారితీస్తుందనే దృష్టికల బౌద్ధం నిజానికి నైతిక నాస్తిక సిద్ధాంతం. బౌద్ధ ధర్మాన్ని పాటించడమనేది సామరస్యత కలిగిన వైజ్ఞానిక, దార్శనిక దృక్కోణాన్ని అవలంభించ డంగా అమలయిందేకాని, నిరాధారమైన అలౌకిక శక్తుల్ని స్తుతించే మూఢభక్తితో కూడిన చెక్క భజనలు చేసే సాంప్రదాయంగా కాదు. దురదృష్టవశాత్తూ, ఈరోజు కూడా బౌద్ధాన్ని ఖూనీ చేస్తూ బుద్ధ విగ్రహాలకి పూజా పురస్కారాలతోబాటు హారతి నైవేద్యాల్ని సమర్పించే మొద్దావతారాలు తయారవుతున్నాయి.

"సామ్రాజ్యవాద ఆధిపత్యాన్ని కొనసాగించడానికి ప్రజలను విభజించి పాలించడానికి యింతవరకూ మానవ మేధస్సు కనిపెట్టిన ఆయుధాలన్నింటిలో ప్రమాదకరమయిన ఆయుధం ఈ కులవ్యవస్థ" అంటాడు స్వామి ధర్మతీర్థ, 'హిందూ

సామ్రాజ్యవాద చరిత్ర'నే తన రచనలో. అలాంటి అమానవీయ కులవ్యవస్థని నిర్మూలించడానికి నిర్మించబడిన సాంఘికోద్యమాలన్నింటిలోకీ దీర్ఘకాలికంగా విజయం సాధించి హైందవ రాకాసిని ఎదిరించి ఆధిపత్యవర్గాల అజమాయిషీని నిలేసి నిలబడిన ఏకైక భావోద్యమం బౌద్ధం. అలాంటి బౌద్ధధర్మాన్ని అంబేద్కర్ అధ్యయనం చేసి దానిపట్ల ఆకర్షింపబడటం అర్థవంతమైనదే కాని ఆశ్చర్యకరమైంది కాదు.

పాశ్చాత్య తత్వవేత్తలకి ఈ దేశంలోని బ్రాహ్మణిజం గురించీ, కులం గురించీ ఎంత తెలుసో ఆ శాస్త్రాల్ని కళ్ళుమూసుకుని మక్కీకిమక్కీగా అనుసరించేవారికి సైతం ఇక్కడి పరిస్థితుల్ని గురించి అంతే తెల్సుననే అభిప్రాయానికి చోటు కల్పించడమంటే అది వాస్తవాల్ని అంగీకరించడమే తప్ప సాహసమనుకోను నేను. "కమ్యూనిస్టులు పుస్తకం మనుషులు. ఆ పుస్తకం రాసిన జర్మన్ జ్యూ బ్రాహ్మణిజాన్ని గురించి విన్నాడే కాని ఎన్నడూ దాన్ని ఎదుర్కోలేదు." అంటారరుంధతీరాయ్ అంబేద్కర్ 'కులనిర్మూలన' గ్రంథానికి 'The Doctor and the Saint' అని రాసిన పీఠకలో.

బౌద్ధాన్ని సమతావాదంగా గ్రహించగల ప్రజ్ఞలేని వారంతా విజ్ఞానవంతులుగా, విద్యాధికులుగా చలామణీ అవుతున్న సమాజంలో వివేకవంతులు తమ బాధ్యతను గుర్తెరిగి నడుచుకోవడం ముఖ్యం. ఏయే ప్రగతిశీల ఉద్యమాల్లో భాగస్వాములైనప్పటికీ ప్రజాసంక్షేమాన్ని కాంక్షించే కారుణ్యపూరిత ధర్మమైన సద్ధర్మమార్గం బౌద్ధాన్ని సజీవంగా ఉంచడానికి అవసరమైన అన్ని కార్యక్రమాల్లో కుదిరినంతలో పాలుపంచుకోవటమవసరం. "ధర్మానికి వారసుడు ధర్మమే" నన్న అంబేద్కర్, "సిద్ధాంతం దానంతటదే జీవించాలి కాని మానవుడి అధికారినికి లోబడి కాదం" టాడు తన 'బుద్ధుడు – అతని ధర్మం' రచనలో.

# 7

"Democracy hasn't eradicated caste. It has entrenched and modernised it. This is why it's time to read Ambedkar.

–Arundhati Roy

సేచ్ఛా సమానత్వం, ప్రేమ కరుణ, సత్యం ధర్మం భావనలతో నిండిన ప్రజాస్వామిక మతమైన బౌద్ధం అమానవీయంగా అణగదొక్కబడినప్పుడే ఈ దేశం



ఆధ్యాత్మికంగా అంధకారంలోనికిపోయి తాత్వికంగా వంధ్యత్వం పాలైంది. ఆరోగ్యకరమైన విమర్శనాత్మక చర్చల్ని ఆహ్వానించే తత్వం నశించి అసహ్యకరమయిన విద్వేషపూరిత తగువుల్ని పెంచే వాతావరణం పెరగిపోయింది. తమకంటూ ప్రమాదం లేకపోతే న్యాయాన్యాయాల సంగతిని గంగలో కలిపేసి నచ్చిన పక్షం తరపున వాదించడానికి సిద్ధపడే వృద్ధమనస్తత్వం వృద్ధిలోకొచ్చింది. ఫలితంగా ఉన్నతీకరించబడాల్సిన దేశం ఉన్మాదీకరించబడింది.

తానూహించిన దేవుడ్ని తోచిన ముద్దు పేర్లెన్నింటినో తగిలించుకుని పిల్చుకుని ఆఖరికి అనామకుడ్ని చేసి 'నామరహితుడ'నే బిరుదునిచ్చింది సనాతన మతం. తనకిలేని అతీత శక్తులన్నిట్నీ అంటకట్టి, అయినా కుతితీరక 'సర్వశక్తివంతు'డన్నారా ఫాసిస్టు మతస్తులు. రాయినీ రప్పనీ, చెట్టునీ పుట్టనీ కూడా పూజించే తమ మురికి తత్వాన్ని కాపాడుకోవడం కోసం దేవుడ్ని 'సర్వవ్యాపకుడ'న్నారు. ఖరీదైన గుళ్ళూ గోపురాలు, ఆరాధనా స్థలాలు, ప్రార్థనా మందిరాలు నిర్మించి కూడా సంతృప్తి చెందక 'సర్వాంతర్యామి'ని చేసేసారు. కోట్లాది కూతల్నీ – రాసుల కొద్దీ రాతల్నీ భగవంతుడ్ని పొగడ్డం కోసమే వెచ్చించి కూడా వెకిలి వెలితిని దాచుకోడానిగ్గానూ సృష్టికర్త 'అనిర్వచనీయుడంటూ' అక్షింతలేసుకున్నారు.

సత్యాన్వేషకుల ప్రశ్నలను యప్పటికయినా ఎదురుకోక తప్పదనే భయంతో ముందునుంచే గందరగోళంతో తొట్రుపడి మతం మెడలో గంటకట్టి సమాజంలోకి వదిలారు. సర్వం జగన్నాధమన్నారు. ప్చ్, పాపం. ఇంతచేసినా ఆలోచన అదరలేదు. విజ్ఞానం బెదరలేదు. లౌకికతత్వం లొంగుబాట పట్టలేదు. స్వేచ్ఛా పిపాస వెనకడుగు వేయలేదు. స్వతంత్ర వికాసం చెక్కభజనలు చేయలేదు. మానవవాద మార్గంలో జనించిన సిద్ధాంతాలు, అవేవయినా కూడా కులీనులతో కల్సి కులకడంకంటే, కూలీనాలీ జనంతో మెలగడాన్నే ప్రోత్సహించాయి. అవే కొత్తగా చరిత్రను సృష్టించాయి.

బౌద్ధం నిస్సందేహంగా అలాంటి మహోన్నతమయిన మతం. మిగిలిన మతాల విషయంలో మతమనే పదాన్ని వాడడానికీ, బౌద్ధం విషయంలో మతమనే పదాన్ని వుపయోగించడానికీ స్పష్టమయిన వ్యత్యాసముందనే నిజాన్ని గ్రహించాలి. "The basic idea of underlying religion is to create an atmosphere

for the spiritual development of the individual" అనే అంబేద్కర్ మాటలే ఆయన బౌద్ధధర్మాన్ని మాత్రమే ఎందుకు స్వీకరించి అసంఖ్యాక అణగారిన ప్రజలకు దాన్ని పరిష్కారమార్గంగా చూపారనే ప్రశ్నకి సరైన జవాబునిస్తాయి.

సమాజాన్ని బాగుచేయడం కోసం ప్రయత్నించడమనేదొక నాగరిక విలువగా చలామణీ అవుతూన్న నాటి నుండీ అందుకోసం ఎవరికి తోచినయత్నాలు వారు చేస్తున్నట్లు ప్రచారం చేసుకోవడమొక ఆధునిక దృక్పథంగా భావించడం జరుగుతోంది. మార్పు కోసం జరుగుతోన్న కృషిలో మమేకమయ్యే మన అభిప్రాయాలన్నీ లాంఛనప్రాయమయిన పురస్కారాలుగానో, లాక్షణికమయిన తిరస్కారాలుగానో కాక సచేతనమయిన కార్యక్రమాలుగా, సర్వ మానవాళి స్వాగతించగల ప్రాపంచిక సత్యాలుగా వెలుగొందాలనేదే బుద్ధి జీవుల కోరిక. అందుకోసం వారుచేసిన పొరపాట్లనీ, తప్పుల్నీ తరచి చూసుకోడానికి వెనకాడే వ్యక్తిత్వాలు ఎప్పటికీ ఎదిగి పురోగమించలేవు. నా దృష్టిలో మానవ జీవితంలో సరిదిద్దుకోలేనంత ఘోరమైన పాపమనేదేదైనా ఉందంటే, అది చేసిన తప్పును నిజాయితీగా ఒప్పుకుని నిండు మనసుతో మనిషిగా పశ్చాత్తాపపడ్డానికి కూడా ముందుకు రాని కర్కశ సందర్భం మాత్రమే.

**బుద్ధం శరణం గచ్ఛామి!**
**ధమ్మం శరణం గచ్ఛామి!!**
**సంఘం శరణం గచ్ఛామి!!!**

**కొన్ని ఆధార గ్రంథాలు :**


1) Into the wild by John Krakaner, published by Pan Books, Division of Macmillan, 2011.
2) కులాల సమస్య, డా॥ రామ్‌మనోహర్ లోహియా, అనువాదం సురమౌళి, తెలుగు అకాడమి, హైద్రాబాద్ ప్రచురణ, 2013.
3) ఉచల్యా, లక్ష్మణ్ గాయక్‌వాడ్, తెలుగుసేత – వసంత, సాహిత్య అకాడెమీ ప్రచురణ – న్యూఢిల్లీ – 1994.
4) రాడికల్ హ్యూమనిస్ట్ పత్రిక, 1983 జనవరి సంచిక, ఎడిటర్ – ఎన్.వి. బ్రహ్మం, చీరాల నుండి ప్రచురణ.





5) అంటరాని వసంతం, జి. కళ్యాణరావు, విరసం ప్రచురణ, 2000.
6) ప్రపంచీకరణ పడగనీడలో మద్యం దోపిడీ (వ్యాస సంకలనం), ప్రగతిశీల మహిళా సంఘం (స్త్రీ విముక్తి) ఆంధ్రప్రదేశ్ ప్రచురణ, మార్చి 8, 2004.
7) బ్రాహ్మణవాదం (భారతదేశానికి శాపం), వి.టి. రాజశేఖర్‌శెట్టి, తెలుగు – పసల భీమన్న, ఝాన్సీ పబ్లికేషన్స్, రాజమండ్రి, 2012.
8) నేను భంగీని, హిందీ – భగవాన్‌దాస్, తెలుగు – జి.వి. రత్నాకర్, హైద్రాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ, 2011.
9) హిందూ సామ్రాజ్యవాద చరిత్ర, స్వామి ధర్మతీర్థ, తెలుగు – కలేకూరి ప్రసాద్, హైద్రాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ, డిసెంబర్, 2000.
10) బీఫ్ రాజకీయాలు, తెలంగాణా విద్యార్థి వేదిక ప్రచురణ ఆగస్టు – 2013.
11) 'The Doctor and the Saint', forward : Written by Arundhati Roy to B.R. Ambedkar "Annihilation of Caste" Published by Navayana, New Delhi, 2013.
12) బౌద్ధ చింతన, ధర్మప్రియ దొమ్మేటి సత్యనారాయణ బోధి, ప్రచురణ : ధర్మదీపం ఫౌండేషన్ – హైద్రాబాద్ – 2013.
13) ఏది బౌద్ధం? ఏది కాదు? వ్యాస సంకలనం, సంపాదకత్వం : క్రాంతికార్, శాస్త్రీయ, హేతువాద, నాస్తిక, లౌకిక మానవీయ వికాస ప్రచురణలు, ఖమ్మం, 2013.
14) Rationalist Voice (Buddhist Special) Vol-7, Issue: 3, 4, 5, Editor - M. Subba Rao, Published from Hyderabad, 2007-08.
15) నేను హిందూనెట్లయిత? కంచె ఐలయ్య, తెలుగు – ఎ. సురేందర్ రాజు, హైద్రాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ, 2000.
16) Frontier సంచికలు, ఎడిటర్ : టిమిర్‌బసు, మోట్‌లైన్, కోల్‌కత్తా నుంచి ప్రచురణ.

# కులానికో సవాలు

***"వస్తే సంక్షోభాలు, సంగ్రామాలు నా కాలంలోనే రానియ్, అలా వస్తే ప్రియమైన నా బిడ్డ పాపలైనా భవిష్యత్తులో సుఖశాంతులతో వర్ధిల్లుతారు"*** – థామస్ పెయినే.

ప్రపంచంలో మరెక్కడాలేని భయంకరమైన ప్రమాదకర రోగం 'కులం'. ఇది భారతదేశానికే ప్రత్యేకం. సమాజంలో అత్యధిక శాతం మందున్న అణగారిన దళిత బహుజనుల్ని ఇంతకాలం మోసగించిన ఈ బ్రాహ్మణీయ భావజాలం ఇంకా ప్రభావం చూపుతోంది. ఒకప్పుడు కేవలం కొద్దిమంది బ్రాహ్మణ అగ్ర కులాల వారికే పరిమితమైన ఈ జాడ్యం, ఈ రోజు వ్యవస్థలో వెనకబడ్డ – దళిత – శూద్రకులాల వారందరిలోకీ ప్రవేశించింది. అభివృద్ధి ముసుగులో ప్రజలపై రుద్దబడుతున్న ప్రపంచీకరణ వినిమయత్వానికీ, నయా సామ్రాజ్యవాదానికీ బ్రాహ్మణీయ సంస్కృతెప్పుడూ వత్తాసు పలుకుతుంది.

వ్యవస్థను శ్రమతో నిర్మించి, అది నడవడానికి నిరంతరం శ్రమించే కార్మిక, శ్రామిక, కర్షకుల్ని చులకనగా చూస్తూ వార్ని వారే కించపరుచుకునేలా చేస్తుందీ అగ్రకుల పాలక వర్గం. తెల్లగా ఉండటం గొప్ప లక్షణమనే భ్రమను సాహిత్యం ద్వారా, సినిమాల ద్వారా జనాల్లోకి చేర్చి అందుకోసం ఎంతోమంది అమాయక యువతీయువకులు కంపెనీల ఉత్పత్తుల్ని కొని వాడుతుంటే చూసి నవ్వుకుంటుంది. భాష, నడక, నడత, పాట, చూపు అన్నీ అగ్రవర్ణాలు చేసినవే అందమైనవనే అహేతుక అభిప్రాయాన్ని దళిత బహుజనుల్లో కలిగించి వారిననుసరించేలా చేస్తుంది. చివరికి ఆహారం విషయంలో కూడా ఈ దేశపు అగ్రవర్ణాల దౌర్జన్యం రాజ్యమేలుతోంది. శతాబ్దాలుగా దళిత బహుజనుల్కి ప్రీతికరమైన గొడ్డు, ఆవు, ఎద్దు, పంది మాంసాల్ని, ఆదివాసీ, గిరిజన, సంచార తెగల ఆహారమైన ఎలుక, పిల్లి, వుడత, ఉడుము, పాము, జెర్రి, పురుగు, పుట్రా పక్షుల మాంసాల్ని నీచంగా ప్రచారంచేస్తూ 'శాఖాహార నియంతృత్వాన్ని' పెంపొందిస్తున్నారు.

ఇది కేవలం శాఖాహారం – మాంసాహారానికి సంబంధించిన విషయం కాదు. ఎవరి సంస్కృతిని వారిచేతనే కించపరిచేలా చేయడం సాంస్కృతిక సామ్రాజ్యవాదపు ముఖ్య లక్షణం. అలాంటప్పుడే వారిలో భావబానిసత్వం పెరిగి ఇతర సంస్కృతులు గొప్పవనే భ్రమలోకి వెళ్ళిపోయి దాన్ని ఆరాధించడం,



అనుకరించడం చేస్తారు. ప్రస్తుతమదే జరుగుతోంది. ప్రపంచమంతా అమెరికన్ సంస్కృతిని చూచి ఇంగ్లీషుకి బ్రహ్మరథం పడుతోంటే తమ ఆధిపత్యాన్ని విస్తరించుకోవటం కోసం ఆ దేశం ప్రయత్నిస్తోంది. అలాగే మనదేశంలోని దళిత బహుజన ఆదివాసీ గిరిజన ప్రజలంతా సుకుమారమైన బ్రాహ్మణీయ దొంగ సంస్కృతిని చూచి, తమ సొంత వారసత్వపు సారస్వత విజ్ఞానాన్ని కించపరుస్తూ వాతలు పెట్టుకుంటున్నారు. నిజానికి ఇప్పుడు మనకి లభిస్తున్న శాఖాహారాన్ని, మాంసాహారాన్నీ కనుగొన్న అజ్ఞాత శాస్త్రవేత్తలు వెనకబడ్డ కులాలయిన దళిత ఆదివాసీ గిరిజన బహుజనులే.

ఏవి తినవచ్చో, ఏవి తినకూడదో తెలీని నాటి సమాజంలో ప్రాణాలకు తెగించి వాళ్ళు చేసిన త్యాగాల ఫలితంగానే ఈరోజీ కడుపులు నింపుకోగలుగుతున్నాం. అనేక వందల సంవత్సరాలు యజ్ఞయాగాల పేరుతో, బలిదానాల పేరుతో లక్షల కోట్ల సంఖ్యలో పశువుల్నీ, మనుషుల్నీ చంపిన బ్రాహ్మణీయ అగ్రవర్ణాలు జైనబౌద్ధాల ధాటి తట్టుకోలేక మాత్రమే 'శాకాహార' నాటకం మొదలెట్టాయి. తమ శరీర వర్ణమైన 'తెలుపు'ని గొప్పచేసేందుకే 'ఆవు'కి పవిత్రతని అంటకట్టి దేవతగా గోమాతను చేసిన హైందవమతం, దళిత బహుజనుల వర్ణమైన నలుపుని కించపరిచేందుకే 'బర్రె'ని యముడి వాహనంగా మార్చింది. మాలమాదిగల పుట్టుక, దేవతా పశువయిన కామధేను మాంసం కూరొండటంతోనే ప్రారంభమైందన్న దుర్మార్గమైన హిందూమతం తన ప్రయోజనాల కోసం ఈరోజు ప్లేటు ఫిరాయించి 'గోపరిరక్షణంటూ' గోల చేస్తోంది.

## 2

**"మనుషులందరికీ ఒకే కులం, ఒకే మతం, ఒకే దేవుడు. కులం అడగొద్దు, కులం చెప్పొద్దు, కులం గురించి ఆలోచించొద్దు. మతం ఏదైనా మనిషిని ఎదగనివ్వాలి. మద్యమనేది విషంతో సమానం. మద్యాన్ని తయారుచేయకండి. మద్యాన్ని ఇవ్వకండి. మద్యాన్ని తాగకండి"** – శ్రీనారాయణగురు

ఇస్త్రీ చేసిన ఇంపైన బట్టల్ని సొగసయిన అవయవాలతో నింపాదిగా ఇరికించి నిజ జీవితంలోని మానవీయ భావాల్ని వ్యక్తపరచడం ఏనాడో మర్చిపోయిన కార్పోరేట్ మెదళ్ళు వికారమయిన చలనచిత్ర నటుల హావభావాల్నే యధాశక్తిగా

ప్రదర్శించేందుకు ప్రయత్నిస్తూ వారిని వాళ్ళే కించపర్చుకుంటున్నారు. సాహిత్యం, కళలు, ఉద్యమాలు అన్నిట్లోనూ అప్రకటితంగానే అమలవుతున్న అగ్రవర్ణ పెత్తనం ఆలోచనతో ప్రశ్నించడాన్ని అర్థంలేని అవివేకంగా – అనవసరమైన అప్రాధాన్య తాంశంగా చూస్తూ, అనాలోచనతో అనుసరించడాన్ని అర్థవంతమయిన నాగరిక చర్యగా – ఆధునిక లక్షణంగా చూస్తోంది. ఇదర్థం కాకుండా సమాజాన్ని అధ్యయనం చేయడం అనర్థం.

ప్రముఖ సామాజిక తత్వవేత్త, రాహుల్ సాంకృత్యాయన్ వోసారి ఏదో సందర్భంలో ఒక చైనా మిత్రుడికి మన దేశంలోని కుల సమస్య గురించి ఎంత విడమర్చి చెప్పినా ఒక ఆరోగ్యవంతుడైన వ్యక్తిని ముట్టుకోడానికెందుకు అభ్యంతరపెడతారో అతడికర్థం కాలేదట. కుల నిర్మూలనా చట్టాల గతి సైతం ఈ వ్యస్థలో అంతే. తమను కాపాడ్డానికి ఈ అగ్రకుల ప్రభుత్వాల చట్టాలేం చేస్తాయో చాలా మందికర్థం కాదు. "సామాజిక వ్యవస్థ పోకడకు వ్యతిరేక దిశలో ఉన్న చట్టాలు వాటంతటవి అమలు కావు. పూనుకుని అమలు చేయించుకుంటేనే అమలవుతాయి" అన్న స్పృహ రావాలి. లేకుంటే చుండూరు తరహా హైకోర్టు తీర్పులే అమలవుతుంటాయి. ఆధిపత్య వర్గాల పాలనా వ్యవస్థలో నిమ్నజాతులకు న్యాయం జరుగుతుందనుకోవడం ఆటవిక మృగం నుంచి సౌమ్యాన్ని ఆశించడం లాంటిదే.

భక్తి విశ్వాసాలకి చెక్క భజనలే ప్రమాణమైనచోట హక్కులనేవి అనాగరికంగానే చూడబడతాయి. దాడులనేవి సంస్కృతిలో భాగమైనప్పుడు కొత్తదారులు వెతుక్కోవటం అనివార్యమవుతుంది. ఆశాజనక భవిష్యత్తుని సాధించడానికి మానవాళికి మిగిలున్న ప్రత్యామ్నాయ మార్గాల గురించిన ఆసక్తికర చర్చను తప్పనిసరిగా అస్తిత్వం కోసం ఆరంభించాల్సిన బాధ్యతాయుతమయిన తరుణంలో మనమున్నామని గుర్తించినప్పుడే, కొద్దిపాటి సిద్ధాంతాల్ని క్షుణ్ణంగా అధ్యయనం చేస్తూ కూర్చోడమే సాంఘికాచరణకి ఆలంబనగా భావించే సాంప్రదాయ ఉద్యమ కార్యాచరణని తృణీకరించగలమనే సంగతిని గ్రహించగలం. మాన ప్రాణాలకన్నా మతవిశ్వాసాలే మిన్ననే చీకట్లో, స్వేచ్ఛకోసం వెలుగెప్పుడూ వేచి చూస్తూనే ఉంటుంది. రాత్రే శాశ్వతమనే సనాతన రాబందులకి మనల్ని లేపే ప్రతి ఉదయమూ వొక విఘాతమౌతుంది. నిషేధాజ్ఞలపై కొనసాగే రాజ్యంపై నిజాలన్నీ పదాలతో కూడా పోరాటం చేస్తాయి.



ఈ నిజాలన్నిట్నీ ఎక్కువమందికి తెలీకుండా చేయటం కోసమే, మతోన్మాదాన్నీ, మద్యపానాన్నీ సమాజంలో అట్టడుగు వర్గాలవారి దరికి చేరుస్తూ దళిత బహుజనుల్ని మత్తులో ముంచే కుట్ర దశాబ్దాలుగా జరుగుతూనే వుంది. అందుకే "మొత్తం దేశంలో ఉన్న దళిత బహుజన ప్రజా ఉద్యమాలన్నీ మద్య నిషేదం కోసం పోరాడవలసిన అవసరం ఆసన్నమైందం"టారో ముఖ్య దళితోద్యమ నాయకుడు. సామ్యవాద తత్వవేత్తయిన కార్ల్‌మార్క్స్ తన కమ్యూనిస్టు ప్రణాళికలో, "చక్కెర, ఉన్ని, సారాయి లాంటి పరిశ్రమలలో యజమానులు తమ లాభాలకోసం సత్యం, ప్రేమ, ఆత్మగౌరవం అన్నీ అమ్మివేస్తారు... పగలంతా కష్టపడి సంపాదించిన డబ్బులు రాత్రయ్యేసరికి ఇంటి యజమానులు, చిల్లర వర్తకులు, మద్యం దుకాణాల యజమానులు లాగేసుకుంటారం"టాడు. గాంధీసైతం తనకోగంటసేపు అధికారమిస్తే మద్య దుకాణాల్ని ధ్వంసం చేస్తానంటూ 'యంగ్ ఇండియా' పత్రికలో రాసాడు.

# 3

**"జీవితంలోని విలువలన్నీ తారుమారైపోయాయి. ఉన్నత కులాలవారు సంస్కారం వున్న కుతంత్రపరులుగాను, బడుగు కులాలవారేమో మార్పు నెరుగని జీవచ్ఛవాలుగానూ తయారయ్యారు. ఇక దేశంలో మేధావుల్ని గుర్తించం కోసం కొలబద్దగా వారి విజ్ఞాన సంపదను గణించడానికి బదులు వారి మాటల్లోని సొంపులు – సొగసులు మాత్రమే తీస్కోవడం జరుగుతోంది. నిర్మోహమాటం, నిర్భయం అనే సుగుణాలకన్నా చాకచక్యం, కుహనా విధేయత, చాటుమాటు వ్యవహారాలనేవే ఔన్నత్యానికి చిహ్నాలుగా మారాయి. రాజకీయ జీవితంలో బొంకులకి గొప్ప గౌరవస్థానం లభించింది. సంకుచితత్వం, స్వార్థపరత్వం ఈ దారుణాల్ని గొప్పతనంగా భావిస్తుంటే, కులవ్యవస్థ మార్పును ప్రతిఘటించే గొప్ప శక్తిగా తయారైంది. భారత పౌరుల్ని స్వదేశంలోనే పరాయివారుగా చూస్తున్నారు. వారి భాషలణిచివేతకు గురౌతున్నాయి."** – రామ్ మనోహర్ లోహియా.

ఈ దేశంలో అంబేద్కర్ భావజాలాన్ని ఆధిపత్య వర్గాలు అద్యయనం చేసినంతగా అణగారిన వర్గాలు అధ్యయనం చేయకపోవడం ప్రజాతంత్రోద్యమాల్లోని ప్రధానలోపం. అందుకే యింకా అగ్రవర్ణ రాజ్యమే నడుస్తోంది. వ్యవస్థీకృతమైన

వ్యవహారాల్నే పాటించడానికి పరిమితమైన సంకుచిత బావజాలోద్యమాలు అవ్యవస్థీకృతమయిన ప్రత్యామ్నాయ ఆలోచనల్నాహ్వానించేంత విశాలంగా విస్తరించి ప్రవర్తించలేవు. అందుకనే ఏదోక వంకతో నిత్యం విద్వేషాల్ని పెంచేందుకు ఎదురుచూస్తుంటాయి. హైందవ మతోన్మాదం కేవలం ఈ ద్వేషాన్ని ప్రాతిపదికగా చేసుకునే తన విషాన్ని దళిత, బహుజనుల్లో కూడా నింపుతోంది. మతం మారిన వారిపై దుర్మార్గమయిన దాడులకి పాల్పడుతోంది. "ముస్లిములపైన జరిగిన దాడులలో 'జాతివ్యతిరేకులు' అన్న నిందకు ఎటువంటి పాత్ర ఉందో, క్రైస్తవుల పైన జరిగే దాడుల్లో 'మతమార్పిడి' అన్నదానికి అటువంటి పాత్రే ఉందంటా"డు బాలగోపాల్. ఈ దేశం హిందూమత జాగీరుకాదని చాటడానికి దళిత బహుజనులు కల్సి బహుముఖ పోరాటాలు చేయాలి.

"ఈ దేశంలో అంటరానివారంటే అసహ్యాన్ని మాటలు లేక చేతల్లో వ్యక్తీకరించకుండా కనుపాపల వరకే పరిమితం చేయడానికి కూడా చాలా రక్తపాతం అవసరమేమోననిపించడం మానలేద"న్న మిత్రులు "కుష్టుకంటే ముందు కులాన్ని నయంచేసే ఆసుపత్రులు ఈ దేశంలో రావాలంటారు. "అభాభేస్వభావనష్టో" అని ఆర్యోక్తి. దరిద్రం మనిషి స్వభావాన్ని ధ్వంసం చేస్తుందని దానర్థం. కానీ, చిత్రంగా ఈ దేశంలోని దరిద్రాన్ని తిరుగుబాటు చేయనీకుండా కులమనేది కాపలాకాస్తోంది. ఇక్కడ ఎన్ని విప్లవ సిద్ధాంతాలైనా కులం గుప్పిట్లోకి వెళ్ళిపోవాల్సిందేకాని కుప్పిగంతులేయలేవు. 'డీక్యాస్ట్'కాని ఉద్యమకారులూ, 'డీక్లాస్'కాని విప్లవకారులూ 'క్యాస్ట్‌లెస్, క్లాస్‌లెస్' సొసైటీని గూర్చి వారుకంటున్న కలల్ని ప్రతిపాదించడాని కభ్యంతరమేమీ లేదు కానీ, ఆచరణలేని అలాంటి ఐటమ్ ఉద్యమాలపై కార్యశీలురకి పెద్దగా భ్రమలుండనక్కర్లేదు. అంతిమంగా కులనిర్మూలనోద్యమాలనేవి సమూల మార్పువాద బహుముఖ ప్రణాళిక ద్వారా వుద్యమ నిర్మాణాన్ని చేపట్టాలేకాని ఏ ఒక్క సిద్ధాంత సూత్రాలపైనో ఆధారపడి కాదు.

చరిత్ర గతి పరిణామశీలమే కాని ఉదాసీనం కాదు. ఇన్ని రోజులుగా సమాజంలోని ఉత్పత్తి కులాలపట్ల తమ ద్రోహాన్ని గురించిన స్పృహను నిజాయితీగా నిర్మించుకునే ప్రయత్నం చేయకుండా మాటవరసకు అంగీకరించినంతలో నీచమైన తప్పులన్నీ హరించుకుపోవు. నిర్లిప్తత నిబద్ధతకి ప్రమాణం కాదు. మా పూర్వీకుల ప్రవర్తనకు మమ్మల్ని బాధ్యులు చేయొద్దనే బూటకపు నాటకాలకిక తావులేదు. మీరేం



చేస్తున్నారో, తరతరాలుగా అణిచివేతని మీ హక్కుగా భావించిన బ్రాహ్మణీయ శూద్ర అగ్రకుల హృదయాలేం చేస్తున్నాయో అడిగే చైతన్యానికి సరైన సమాధానం చెప్పకుండా ఇంకా ఎక్కువ కాలం తప్పించుకోవాలనుకోవటం వాళ్ళ అమాయకత్వం. వాళ్ళ పిల్లలకి కూడా వారసత్వంగా సంక్రమిస్తున్న మూర్ఖత్వం. వాళ్ళ కులాలకుళ్ళుని సవాలు చేసే తరం త్వరలోనే రావాలని కోరుకుంటున్నాను. అలాంటి తరానికిదే నా వ్రాతపూర్వక ఆహ్వానం.

# 4

**"నేను మట్టికావడం కంటే బూడిద కావడానికే ఇష్టపడతాను. కుళ్ళి కృశించి నశించడానికి బదులు నాలోని ప్రతి అణువూ భగభగమండే మంటల్లో ఆహుతవాలనుకుంటాను. మందకొడిగా ఒక శాశ్వత గ్రహంగా ఉండటం కంటే దేదీప్యమానంగా వెలిగి పతనమయ్యే అద్భుతమైన ఉల్కగా మారాలనుకుంటాను. మనిషన్నవాడు జీవించాలి, బతుకీడ్చడం కాదు."** – జాక్ లండన్.

అసమానతలన్నీ ప్రశ్నించే వీలులేని భగవంతుడి ఆజ్ఞలుగా చలామణీ అవుతున్న దేశంలో భావోద్యమాలనేవి ఆశించినంత త్వరగా విజయం సాధించలేవు. చార్వాకలోకాయతాలపై దాడులకి తెగబడ్డమూ, బౌద్ధుల్ని రోట్లో రుబ్బడమూ, సత్యకామ జాబాలుల సాక్షిగా శూద్ర శంభూకుల తలలు నరకడమూ ఇక్కడింకా ఆగలేదు. అందుకనే చింతనాత్మక మార్గాలన్నీ ఇంకిపోయి చింకిపాతర మతాలొచ్చాయి. సామాజిక ఔన్నత్యాన్ని ఇనుమడింపజేసే వైజ్ఞానిక దృక్పధాలు మొత్తంగా కుంటుపడి వింతరోగాల్ని విస్తరింపజేసుకునే విచ్ఛిన్న వైఖరులు అంటురోగాల్లా పెరగనారంభించాయి. శుద్ధ అనాచరణీయ అహింసను బోధిస్తూ దళిత బహుజనుల్ని శాంతికాముకులు కండంటూ దండగోపన్యాసాలిచ్చే దుండగులే స్వార్థంకోసం నిమ్నజాతుల ప్రజలపై హత్యలకు తెగబడ్డారు.

"హింసను సమాజాన్ని మార్చే ఒక శక్తిగా ఆహ్వానిస్తాను. ఒక వాదంగా తిరస్కరిస్తా"నన్న అంబేద్కర్, "అహింసా పరమో ధర్మః అనేదొక అతివాదం." అంటాడు తన 'బుద్ధుడు అతడి ధర్మంలో'. 'కులసమస్యపై రెడీమేడ్ జవాబులివ్వడానికి అలవాటుపడ్డ మేధావులు, ముఖ్యంగా వామపక్షశీలురు మార్క్స్ జపం చేయడానికలవాటు పడ్డంతగా మానవతావాద దృక్కోణాన్ని మలుచుకోడంలో

విఫలమవడం వలనే వారిపై వొచ్చే సద్విమర్శల్ని సైతం సామ్రాజ్యవాదుల కుట్రలనో, ప్రపంచీకరణ ఫ్యాషన్‌లనో తోసి పారేస్తున్నంతగా తరచి చూసుకోవడం లేదు.

ఏ కులమూ లేదనే వారికి సైతం ఏదోక కులాన్ని కలపకుండా ఊసుపోని వారెందరోనున్న మన వ్యవస్థలో ఉన్న కులాన్ని ఆంతరికంగా అభిమానిస్తూనే బహిరంగంగా తులనాడడం ద్వారా అభ్యుదయాన్ని కూడగట్టుకోవాలనే కుతి ఉద్యమకారుల్లో రోజురోజుకూ పెరిగిపోతోంది. మిత్రులు సు.జ.రే గారన్నట్లు ఒకే కులంలో వివాహ సంబంధాలు నిషేదించబడాలనే (Marriages within the same caste should be prohibited) చట్టం రావల్సుంటుందేమో చూడాలి. అసలు సమాజంలోని యువతలో రోజురోజుకీ పెరుగుతున్న మూఢభక్తి విశ్వాసాల నుంచి బయటపడకుండా ఏ మార్పు సాధ్యం కాదు. "ప్రాణాలు తీసే సిఫిలిస్‌లూ, గనేరియాలు, హెర్పిసులు, హెచ్చైవీలు, సవాలక్ష సుఖరోగాలన్నీ తాగుబోతు ముండలముఠాకోరయిన తండ్రి నుండి ఏ పాపం ఎరగని అతని బిడ్డకి సంక్రమించినట్టు – భగవంతుడు వ్యభిచారీ, సుఖరోగి కాకపోతే ఈ సుఖరోగాలన్నీ ఈ లోకంలోకెలా వచ్చాయో అన్నిటికీ మూలం భగవంతుడేననివాగే సోంబేర్లే చెప్పాల"న్న మిత్రులు ఇంద్రగారు, "మతవిశ్వాసాలనీ, సైంటిఫిక్ టెంపర్‌ని సమానంగా గౌరవిస్తామనడం – పాకీగొడ్లో కూర్చొని గారెలు తినడం లాంటిదం"టారు తన మ్యూజింగ్స్‌లో.

**"చాలాకాలంగా వింటున్నదనిగానీ లేదా సాంప్రదాయంగా వస్తున్నదనిగానీ లేదా ఎవరో చెప్పగా విన్నదనిగానీ, పవిత్రగ్రంథాలు సూచిస్తున్నాయనిగానీ, సమర్ధుడైన గురువు బోధిస్తున్నాడనిగానీ దేనినీ సత్యంగా స్వీకరించవద్ద"న్న బుద్ధుడు, "అకుశలమైనవీ అసత్యమైనవీ అని మీరు తెలుసుకున్న విషయాల్ని నిరాకరిస్తూ, కుశలమైనవీ హేతుబద్ధమైనవీ అని మీరు తెల్సుకున్న విషయాల్ని మాత్రమే సత్యాలుగా అంగీకరించి ఆదరించమన్నాడు."** ఆనాటి సంఘం నుంచి ఈనాటి సమాజం వరకూ ఏనాటి వ్యవస్థకైనా ఇంతకంటే విప్లవాత్మకమయిన విజ్ఞానదాయకమైన, పరిణామశీల, పురోగామి మార్గదర్శక మాటలు మరేవీ వుండవనేది కులమత నిర్మూలనోద్యమాల్లో కృషి చేస్తున్న మిత్రులు ఇప్పటికైనా గుర్తిస్తే మంచిది.



**"దివా తపతి అదిక్కో**
**రాతిం అభాతి చందమా;**
**సన్నద్ధో కతియోతపతి**
**ఝాయా తపతి బ్రహమతో;**
**అత్తా సబ్బాయనీ అహోరాత్తాయన్**
**బుద్ధో తపతి తేజసా"**

**భావం :** సూర్యుడు పగలు మాత్రమే ప్రకాశిస్తాడు. చంద్రుడు రాత్రి వేళలోనే వెలుగొందుతాడు. యోధుడు సాయుధమైనప్పుడే కాంతులీనతాడు. బ్రాహ్మణుడు ధ్యాన ముద్రలో ఉన్నప్పుడే తేజస్సుతో కనిపిస్తాడు. కానీ, బుద్ధుడు రాత్రి పగలూ ఎల్లప్పుడూ నిరంతరాయంగా దేదీప్యమానంగా ప్రకాశిస్తూనే ఉంటాడు.

– అంబేద్కర్, బుద్ధుడు – అతని ధర్మం, పే-498

## కొన్ని సంప్రదిత గ్రంథాలు :

1) విశ్వనరుడు టామ్ పెయిన్, మూలం – హోవర్డ్ ఫాస్ట్, అనువాదం – నిడమర్తి అశ్వనీకుమార్ దత్తు, నిడమర్తి ఉమా రాజేశ్వరరావు, సేచ్ఛ ప్రచురణలు, హైద్రాబాద్ – 2005

2) హిందూ మతానంతర భారతదేశం, కంచె ఐలయ్య, ప్రచురణ సంవత్సరం , గుర్తులేదు.

3) కేరళ సామాజిక తత్వవేత్త శ్రీ నారాయణగురు, సత్యబాయి శివదాస్, పి. ప్రభాకరరావు, తెలుగు – ప్రభాకర్ మందార, హైద్రాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ – 2009.

4) గృహహింస రక్షణ చట్టం వాడుకోవడమెలా కరపత్రం, మానవ హక్కుల వేదిక ప్రచురణ, విజయవాడ – 15.12.06

5) 'మద్యంలో ముంచి మరణశాసనం', సోమవారం 21, ఫిబ్రవరి 2005 నాటి 'వార్త' దినపత్రికలో వ్యాసం, 'బడుగుజీవుల్ని ముంచుతున్న మద్యం' గురువారం 23, ఆగస్టు 2007 'వార్త' దినపత్రిక వ్యాసం, రచన : కత్తి పద్మారావు.

6) నెగిటివ్ కథలు, కెమేరా విజయ్‌కుమార్, స్రవంత్ పబ్లికేషన్స్, రాజమండ్రి – జనవరి 2009

7) దృక్కోణం, రావు కృష్ణారావు (ఆర్.కె.ఆర్.) పంచవటి ఎడ్యుకేషనల్ సొసైటీ ప్రచురణ, హైద్రాబాద్ – ఏప్రిల్ 2004.

8) దళిత సమస్య పరిష్కారానికి బుద్ధుడు చాలదు, అంబేద్కరూ చాలదు, మార్క్స్ కావాలి, రంగనాయకమ్మ, స్వీట్‌హోమ్ పబ్లికేషన్స్, హైద్రాబాద్ – 2003.

9) అంబేద్కర్ సూర్యుడు (రంగనాయకమ్మకి సమాధానం), కె.జి. సత్యమూర్తి (శివసాగర్), డా॥ అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్టు ప్రచురణ – హైద్రాబాద్ – డిసెంబర్ – 2004.

10) అడివి పిలిచింది, మూలం – జాక్ లండన్, తెలుగు – గాంధీ, పీకాక్ క్లాసిక్స్ ప్రచురణ, హైద్రాబాద్, 2003.

11) కులాల మూలాలు – కుల నిర్మూలనా మార్గాలు, సు.జ.రే. అనంతపురం హేతువాద సంఘ ప్రచురణ, 2011.

12) నువ్వూ నేనూ లోకం (మ్యూజింగ్స్) డి.ఆర్. ఇంద్ర, వెన్నెల ప్రచురణ, రాజమండ్రి, ఏప్రిల్, 2003.

13) మద్యంపై యుద్ధం, గౌరవ్, ప్రత్యామ్నాయ ప్రస్థాన కేంద్ర ప్రచురణ, హైదరాబాద్, 2012.

14) సాంఘిక తత్వం – వైష్ణవ మార్గం, గౌరవ్ ప్రజా ప్రచురణలు, పిఠాపురం, 2011.

15) 'భౌతికవాది' పత్రిక సంచికలు, సంపాదకులు – మలయశ్రీ, తెలంగాణా నాస్తిక సంఘం ప్రచురణ, కరీంనగర్.

16) 'చార్వాక న్యూస్' పత్రిక సంచికలు, సంపాదకులు : కె. అయ్యన్న, బి. సుధాకర్, చార్వాకాశ్రమ ప్రచురణ, నిడమర్రు పోస్ట్, మంగళగిరి మండలం, గుంటూరు జిల్లా.



# భావోద్యమాల భవితవ్యం లౌకికోద్యమాల తాత్విక సమస్యలు

అడిగేవారికి తెలీకపోవచ్చు కానీ ప్రశ్నించడమనేదొక ప్రత్యేక భావజాలానికి ప్రతీక. వ్యక్తీకరణగా వెల్లడయినంతలో దాన్ని కేవలం వ్యక్తిగతాంశంగా చూడలేం. సమాధానాలకోసం ప్రయత్నించకపోవడం స్తబ్దతవుతుందే కాని సత్యాన్వేషణ కాదు. నాస్తిక హేతువాదోద్యమాల తీరుపై విమర్శలొస్తున్నాయంటే అది మన విధానాన్ని గురించి పునరాలోచించుకోవల్సిన నిర్మాణాత్మక వైఖరిలో లోపాల్ని లోతుగా చర్చించవలసిన సందర్భాల్ని గుర్తు చేయడం కోసమే కానీ ప్రత్యేకంగా లౌకికోద్యమాల్ని కించపరచడం కోసం కాదని అర్థం చేసుకున్నప్పుడే ముందుకు సాగగలుగుతాం.

సమాజంలోకి సమస్యలపై శాస్త్రీయమయిన విశ్లేషణతో కూడిన వివరణాత్మక అధ్యయనం చేయకుండా వివిధ రకాల నాస్తిక సిద్ధాంతాల్ని వల్లె వేసుకోవడం వల్ల ఒరిగేది శూన్యం. రానురాను యువత ప్రగతిశీలోద్యమాలకెందుకు దూరమౌతున్నారనే ప్రశ్నకి నిజాయితీగా జవాబు వెతుక్కునే ప్రయత్నం చేయనంతకాలం భావిభావోద్యమాల్ని నిర్దేశించేందుకు అవసరమైన ఉద్యమ పరిధిని నిర్మించుకోలేం. తాత్విక భూమికలేని గొడవలు సైద్ధాంతిక ప్రాతిపదికను అందుకోలేవ్. అలాంటప్పుడు ఏ ఉద్యమానికైనా ప్రాపంచిక దిక్సూచి కావాలి.

"If instinct alone sufficated to liberate peoples, they would long since have freed themselves. Those instincts did not prevent them from accepting... all the religions, political and economic absurdities of which they have been the eternal victims. They are ineffectual because they lack two things... organization and knowledge." అంటాడు మైకెల్ బకూనిన్ అనే సామాజిక తత్వవేత్త. లౌకికోద్యమాలు ఈ విషయంలో నేర్చుకోతగ్గదేమైనా ఉన్నదేమో తరచి చూసుకోవడమవసరం.

తత్వశాస్త్రాన్ని అస్తిత్వం మొత్తాన్ని వివరించే విషయాంశంగా (Philosophy is to explain existence as a whole) పేర్కొన్న మానవవాద తత్వవేత్త యమ్మెన్ రాయ్ మార్మిక పురాణాలన్నీ అజ్ఞాన ఫలితాలేనంటూ (Mysticism results from ignorance), ఆధునిక విజ్ఞానశాస్త్రం నిశ్చయంగా ఏ తరహా ద్వంద్వ

సిద్ధాంతానికైనా వ్యతిరేకం (Modern Scientific philosophy is decidedly opposed to any dualist doctrine) అంటాడు. ద్వైదీభావంగల అజ్ఞాతవాదాల పట్ల మనం ఏర్పర్చుకోవాల్సిన దృక్పథంపై ఆరోగ్యకర చర్చలవసరం.

అజ్ఞాతవాదాలకీ – మధ్యేమార్గాలకీ తేడా తెలీని వాళ్ళంతా వొంతులవారీగా నాస్తిక హేతువాదోద్యమాలతో కలిసి పనిచేసే అవకాశమున్న మానవీయ లౌకికోద్యమాల పట్ల కూడా దూరం పాటిస్తున్నారు. ఈ విషయాల్లో స్పష్టత లేకుండా ఊతపదాలతో ఉద్యమాలు నడుస్తాయనుకునే అమాయకత్వం వర్తమాన వ్యవస్థలో పెచ్చుమీరుతున్న మతశక్తులకి ప్రధాన కారణం, శాస్త్ర సాంకేతిక రంగాల్ని అవి విస్తృతంగా ప్రచారం కోసం ఉపయోగించడమేననే నిజం వొప్పుకోవాల్సుంటుంది. "Life was too short for people to have conscious" అంటాడు కుష్వంత్‌సింగ్.

“మతపరమైన రంగంలో నమ్మకాన్ని తాత్కాలికంగా ఆపేయడమే అజ్ఞాతవాదంగా పేర్కొంటున్నాం. దేవుడున్నాడా లేడా అనే సందేహం ఉన్నవారు తమ నిర్ణయాన్ని ఆపేస్తారన్నమాట. తగినంత ఆధారంలేని విషయాలలో ఏదీ చెప్పకపోవడం సందేహవాదంగా పేర్కొంటున్నారు. అంటే శూన్యవాదం కాదు. విచారించాల్సిన అంశాలలో నిర్మాణాత్మక ప్రత్యక్ష జిజ్ఞాసను కనబరచటమే. మత పరిధిలో సందేహవాదం తటస్థవైఖరికి దారితీస్తుందనటానికి వీలులేదు. దేవుడున్నాడా అనే విషయమై ఇంతవరకున్న ఆధారాలను బట్టి లేడనే అనిపిస్తుంది. ఈ విషయంలో సందేహవాదిగా నేను నాస్తికుడ్ని” అంటారు పాల్‌కజ్.

కాబట్టి, ఇప్పటికైనా వాస్తవాలను గుర్తించి నడుచుకోవడం వల్ల మాత్రమే ప్రజాతంత్రోద్యమాల ప్రణాళికలో లౌకికోద్యమాలు గణనీయమయిన పాత్రను శక్తివంతంగా పోషించగలవు. వివిధ తాత్విక విషయాల్ని గూర్చిన సమస్యలపై అధ్యయనంతో కూడిన కృషి చేయకుండా నిర్దిష్టమయిన అంశాన్ని పదే పదే ప్రచారం చేయడం నిష్ప్రయోజనం. "Every step of real movement is more important than a dozen programmes" అంటాడు కార్ల్‌మార్క్స్ 1875లో బ్రాక్‌కి రాసిన లేఖలో. ఆయన మాటల్లోంచి గ్రహించాల్సిన ఆచరణాత్మక స్ఫూర్తిని అవగతం చేసుకోడం ఈసరికే ఆలస్యమైందనే నిజం ప్రగతిశీల మిత్రులు గుర్తిస్తే మంచిది.

ఎందుకంటే, హేతువాద పునరుజ్జీవనాన్నాశించే వారంతా వివిధ సాంఘిక క్షేత్రాలకు సంబంధించీ తమ వారసత్వ విధానాల్ని వైధానిక ఆచారాలుగా (Methodological Traditions) క్రమబద్దీకరించడానికి చూస్తున్నారు కాని వివేచనాపూర్వక విశాలత్వాన్ని పెంపొందించుకోలేక సిద్ధాంత ముద్రలకోసం పాకులాడుతున్నారు. సమాజ గమనాన్ని ఉద్యమాలకి అన్వయించుకోడానికి సైద్ధాంతిక భావజాల రూపాలకంటే, కార్యశీల ఆచరణా క్షేత్రాలే ముఖ్యమనే స్పృహ కలగకుండా ఊహాత్మకమైన ఉద్యమ కల్పనలకి చోటుకల్పించడం కట్టుకథల్ని వాస్తవాలేనని జనాన్ని నమ్మించడంతో సమానం.

"The institutionalization of knowledge leads to a more general and degrading delution. It makes people dependent on having their knowledge produced for them. It leads to a paralysis of the moral and political imagination." అంటాడు Ivan Illich 'Tools for Convivaility' అనే రచనలోని "The demythologization of Science" అనే విభాగంలో. అంగీకార అనంగీకార వైఖరుల్ని పక్కనబెట్టి క్షేత్రస్థాయిలో వాస్తవాల్ని పరిశీలిస్తే గాని నడుస్తున్న వ్యవస్థలోని దోపిడీ అర్థం కాదు.

సమస్యల మూలాన్ని ఎక్కడర్థం చేసుకుంటారోననే భయంతోనే లాభసాటి వర్గాలు ప్రజానీకాన్ని అనవసరమైన మతాల్లోను, విలాసవంతమైన ఆడంబరాల్లోనూ ముంచెత్తుతుంటారు. వస్తువినిమయత్వంపై పెరిగిన మితిమీరిన వ్యామోహం వ్యవస్థలోని నిజాల్నుంచి ప్రజల దృష్టి మళ్ళించగల్గుతోంది. "While the poor are offered addiction as a way to escape thinking too much, working people are encouraged to shop. Consumer culture silences working people and the middle classes. They are busy buying or planning to buy..." అంటారు, Bell Hooks 'Where we stand : Class matters' (వర్గ దృక్పథంలో మనమెక్కడున్నాం) అనే తన రచనలో.

ఇలాంటి సంక్లిష్ట సమయంలో ఎటువంటి ప్రజాతంత్ర ఉద్యమమైనా జరుగుతున్న సామాజిక వాస్తవాల పట్ల నిర్లిప్తత వహిస్తూ, ఎన్నాళ్ళుగానో రంగరించుకుని సిద్ధం చేసుకున్న క్లిష్టమైన పదజాలాన్ని భావజాలమనే భ్రమతో వల్లించడం వల్ల ప్రయోజనం లేదు. నాస్తిక హేతువాద లౌకిక తాత్విక మానవీయ ప్రజాసంఘాలతో క్రియాశీలకంగా పనిజేయాలనుకునే మిత్రులు ఈ విషయాల్ని గుర్తుంచుకుంటే బాగుంటుంది. ఇవేవీ లేని కేవల తర్కం అప్పటికప్పుడు

గందరగోళంగా వ్యక్తుల్ని తికమకపెట్టి ఆకర్షించడానికి అక్కరకొచ్చినా, జనచైతన్యో ద్యమాల్లో అంతిమంగా జడప్రాయంగా వుండిపోవాల్సిందే కాని క్రియాశీలక పాత్ర పోషించలేదు.

భాషా సిద్ధాంతాలపై మంకుపట్టు పట్టడమే విప్లవాత్మకమైన విసంస్కృతీకరణకు దారితీస్తుందనే వారి గుడ్డి విశ్వాసంలోని అశాస్త్రీయత గురించి తెలియజేయకుండా వారి విధానాలపై విమర్శాత్మక సమీక్ష చేకుండా, ఏ సిద్ధాంతాలకు సంబంధించిన చర్చయినా వ్యక్తుల ప్రతిభాయుత నియంతృత్వానికి లోబడి కాలక్షేపం చేయగలదేమో కాని ప్రజాస్వామిక పథాల్లో పయనించి మాత్రం కాదు. తొంభైశాతం మంది ఏదోక మతాన్ని పాటించుతోన్న వ్యవస్థలో వారినేదో విధంగా కించపరచడం ద్వారా మార్పొస్తుందనుకోవడం లౌకికోద్యమాల సామూహిక భ్రమకి పరాకాష్ట.

పద నిర్వచనాలతో పదనిసలాడే సంస్థలు కూడా కొద్దిమందితో తోచిన విన్యాసాలు చేసుకునే విమత ఆధ్యాత్మిక సంఘాలుగా మిగిలిపోవాల్సిన పరిస్థితులు తలెత్తడానికి వాటి తాత్విక లోపమే ప్రధాన కారణమనేదాన్ని గుర్తించడంలో సఫలమైతేనే ఏ సాంఘికోద్యమాలతోనైనా సాంగత్యం సాధ్యపడి భావోద్యమాల పునరుజ్జీవనోద్యమం శక్తివంతమౌతుంది. ఎవరేం ఆలోచించాలో, చర్చించాలో, ఆచరించాలో నిర్ణయించే అధికారం వికేంద్రీకరణకు గురయ్యి సమిష్టితత్వాన్ని బలపర్చకుండా జరిగే ఏ అన్వేషణైనా బయలుదేరిన చోటుకే చేరుతుంది.

"You cannot completly define a man, a horse, labour, science, capitalism, socialism, a bolt, or any other thing or process that exists in the world. It is too complicated; it has too many aspects, many connections with all the rest of the world. But you can draw attention to one or more sides or aspects by means of definition" అన్న వొక వేత్త, "The impossibility of providing a complete definition or description or anything in a limited form of expression, therefore, arises from the many sided interconnections of any particular thing with its environment" అంటాడు.

ఇవేమీ పట్టించుకోని పదపదన్యాసాలు, నిర్వచన విన్యాసాలు, శిక్షణ తరగతులతో కూడిన గంభీరోపన్యాసాలు ఇప్పటికే వెనకబడ్డ నాస్తిక హేతువాదులకి



తోడుగా జోడు కావడానికుపరిస్తాయే కాని మరెందుకూ కాదు. విజ్ఞానశాస్త్ర ఆవిష్కరణల్ని విలాసవంతమైన జీవితాలకీ, అవస్థపడే నడవడికకీ మాత్రమే అన్వయించుకోవడం అలవాటయిపోయిన వ్యవస్థలో ఆధునికతకి నిర్వచనాన్ని సృజనాత్మకత శైలిలో ఇవ్వటం అత్యంత ముఖ్యం. ఎవరూ ఎప్పటికీ (ఎదగని) గెలుపొందని పోటీ మనస్తత్వాన్ని ప్రజల్లో పెంచి రకరకాల వస్తువుల్ని పక్కవారితో పోల్చుకుని పిచ్చిగా కొనుక్కుని, వినియోగిస్తుంటే, ఇంకా కొత్తవి, పెద్దవి, ఖరీదైనవి, సున్నితమైనవీ, తేలికైనవాట్ని ఉత్పత్తి చేస్తూ డబ్బులు దండుకోవడం కార్పోరేట్ సంస్థల మోసం. దీన్ని గుర్తించాలి.

అస్తిత్వోద్యమాలన్నింటినీ ప్రక్కనపెట్టి పదిమంది భావజాల, పదజాల మాంత్రికులందరూ పూనకమొచ్చినప్పుడల్లా ఊగిపోయి, అర్ధంకాని సిద్ధాంతాల్తో కూరుకుపోడం సరికాదు. "... each social context produces its own pattern of insight and blindness, its own urgencies and indifferences, its own penetrating revelations and built in confusions. A new global science, must share techniques, knowledge and tools, be able to compare and choose, but also respectfully leave room for radically different approaches for facing the unknown" అంటాడు రిచర్డ్ లెవిన్స్ 'When science fails us' అనే రచనలో.

భౌతిక భోగలాలసత్వమే పరమావధిగా సాగుతున్న నేటి తరుణంలో శుద్ధ హేతువాదం కంటే నైతిక భౌతికవాదాన్ని సమర్ధించడం సరికాగలదేమోననే దృష్టితోనే ఈ రకంగా నా భావాల్ని వెల్లడించానే కాని ప్రగతిశీల వుద్యమరంగాల్ని గుడ్డిగా ప్రతిఘటించడమో, ప్రత్యేకంగా కించపరచడమో నా ఉద్దేశం కాదు. బౌద్ధాన్ని కూడా అందుకే సమర్ధించల్సొచ్చింది తప్ప ఈనాడు కొనసాగుతున్న వింత – వికృత బౌద్ధాన్ని అంగీకరింపజేయడం కోసం కాదు. "In an age innocent of science he (Buddha) found for the problems of whence, the whither and the why solutions worthy of a scientific age. His aim was to rescue mankind from the fetters of passion and avarice and to convince them of an ideal higher than mere worldly good" అంటారు పి. లక్ష్మీనరసు 'Essence of Buddhism' లో.

బహుశా "బాటసారి తన ప్రయాణంలో తనకన్నా గొప్పవాడు కానీ తన సమఉజ్జీగానీ దొరకనప్పుడు ఒంటరిగానే పోవాలి కాని మూర్ఖునితో మాత్రం జత కూడదన్న" అంబేద్కర్ మాటలు ఈనాటి నాస్తిక హేతువాదోద్యమ సంఘాలకి వర్తిస్తే, "భారతదేశానికి బౌద్ధధర్మం తప్ప మరో ప్రత్యామ్నాయం లేదు. భారతదేశపు స్వాతంత్ర్యం పరిరక్షించుకోవాలన్నా, దాని గౌరవం కాపాడాలన్నా బౌద్ధమే శరణ్య"మనే ఆయన వాక్కులు లౌకికోద్యమాల్లో కృషి చేస్తున్న సంస్థలన్నింటికీ సమంగానే సమాధానం చెబుతున్నాయని నేననుకుంటున్నాను.

"నేనే స్థితిలో ఉన్నను ఆ స్థితిలో సంతృప్తి కలిగియుండ నేర్చుకొని యున్నాను. దీనస్థితిలో ఉండనెరుగుదును. సంపన్న స్థితిలో ఉండనెరుగుదును, ప్రతి విషయములోను, అన్ని కార్యములలోను కడుపునిండియుండుటకును, ఆకలిగొని ఉండుటకును, సమృద్ధి కలిగియుండుటకును, లేమిలో ఉండుటకును నేర్చుకొని యున్నాన"నే బైబిల్ వాక్యం (ఫిలిప్పీయులకు – 4:12) ఇంతకాలంగా ప్రజల్ని మభ్యపెట్టడానికుపయోగించవచ్చుగాక. కానీ, సామాజిక చైతన్యోద్యమాల్లోకి – భావజాలోద్యమాల్లోకి రావాలనుకునే ప్రజాతంత్ర కార్యకర్తలెలా వుండాలో చెప్పకనే చెబుతుందది. ఆ స్ఫూర్తి ఈరోజవసరం.

ఏది ఏమైనా లౌకికవాద భావోద్యమాల తాత్విక దృక్పథాల పట్ల విభిన్న చర్చలు, పలు సంవాదాలు జరుగుతున్న ఈ సమయంలో సైద్ధాంతిక స్తబ్దతని చెరిచే ఏ ఉద్యమ లక్ష్యసాధనమైనా అభిలాషణీయమైందనే ఆకాంక్షతోనే ఈ రకమైన రచనకి తెరదీసాననే విషయం మరోసారి స్పష్టం చేయదలుచుకుంటూ సెలవు తీసుకుంటున్నాను.

**"నరుని కష్టపెట్టి నారాయణునిగొల్చు**
**ధర్మశీలురున్న ధరణిమీద**
**కాలుమోపలేక గబ్బిలమొక్కటే**
**చరణయుగళి దివికి సాచి నడచు"**

– గుఱ్ఱం జాషువా



**కొన్ని ఆధార రచనలు :**

1) When science fails us by Richard Levins, first published in September '96, issue of 'International Socialism'. Reprinted in India by Vilas Sukhdeve for 'in search', Nagpur.

2) Tools for conviviality, Ivan Illich, Harper Colophon Books 1980.

3) What the Buddha Taught, walpala rahula, Published & distributed by 'The Corporate Body of the Buddha Educational Foundation.

4) Literary and philosophical essays, Jean - Paul sartre, Hutchinson & co publishers - 1969.

5) Where we stand : Class matters, bell hooks, published by Routledge - 2000.

6) 1956 అక్టోబర్ 14న నాగపూర్ దీక్షాభూమిలో బాబాసాహెబ్ డా॥ అంబేద్కర్ మరాఠీ ప్రసంగం, మూలం : శ్రీ శ్యామ్ తగాడే, ఐ.ఏ.ఎస్ (మహారాష్ట్ర) "బౌద్ధ ధర్మ మిషన్ ఆఫ్ బోధిసత్వ అంబేద్కర్" గ్రంథం నుండి డా॥ యెండ్లూరిచే తెలుగుచేసి ప్రచురించబడింది.

7) మేధావులు – సమాజం, కూర్పు – వై.వి. రమణారావు, స్వరాజ్య భారతి ప్రచురణలు, ఖమ్మం, 2010

8) జాషువా సర్వలభ్య రచనల సంకలనం, మనసు ఫౌండేషన్, బెంగుళూరు, ప్రచురణ సంవత్సరం లేదు.

9) సాహసించండి! మారండి!! (The Courage to Become; The Humanist virtues by Paul Kurtz) తెలుగు – ఇన్నయ్య, హేమా పబ్లికేషన్స్, చీరాల – 1998.

10) Gora Books, Published by Atheist Centre, Vijayawada.

# బహుజన భారతంలో శాఖాహార ప్రహసనం

**"ఒక జాతికి ఒక తత్వాన్ని, లక్షణాల్నీ శాశ్వతమైనదిగా ఆపాదించడమనేది మానవ మేధస్సులోని ఒక గొప్ప లోపం. అలా శాశ్వతమైన లక్షణమనేది మానవజాతి మొత్తానికే ఏదీ లేదేమో!"** – రామ్ మనోహర్ లోహియా

అధికారంలోకొచ్చీ రాగానే వోట్లేసిన జనాల మాటేమోకానీ గోపరిరక్షణకు మాత్రం మోడీ ప్రభుత్వం స్వీకారం చుట్టి ఎన్ని వందల కోట్ల రూపాయల్తోనో ప్రత్యేక నిధిని కూడా ఏర్పాటు చేసింది. దీన్ని జంతుప్రేమగా అర్థం చేసుకోమంటూ దబాయించే వీర హైందవులనలా వుంచి, సామాన్య జనాల ఆలోచనా విధానాన్ని ఈ తిరోగామి శక్తులెలా మలచాలనుకుంటున్నాయో తెలుసుకోవడం అవసరం. మనిషి స్వతహాగా శాఖాహారా? మాంసాహారా? అనే చర్చకిది వేదిక కాదు కానీ కొన్ని సంవత్సరాలుగా మన దేశంలోని మత శక్తులకి అకస్మాత్తుగా ఆవంటే అంత ప్రేమెందుకు పుట్టుకొచ్చిందనేది ప్రశ్నార్థకం.

కోడి, ఎలక, కుక్క, పంది, చేప, ఏనుగు, పాము మొదలైనవి కూడా హైందవ పురాణాలెక్కడో అక్కడ ప్రస్తావించినవే, కోడి, మేక, చేప, రొయ్య, గొర్రె మొదలగు మాంసాలు అత్యధికశాతం మందిచేత నిరభ్యంతరమైనవిగా పరిగణించబడుతుండగా కుక్క మాంసం ఈశాన్య రాష్ట్రాల్లో, ఇతర జంతువుల మాంసాలు ఆదివాసుల్లో, సంచార తెగల్లో వ్యాప్తి చెందున్నాయి. వీటి విషయంలో ఎన్నడూ అభ్యంతరపెట్టని సనాతనులు దళిత బహుజనులకి ప్రియమైన 'గొడ్డుమాంసం' విషయంలో మాత్రం ఎందుకు కళ్ళెర్రజేస్తున్నారో తెల్సుకోవాలి. పూర్వం నుంచీ గోమాంసం బ్రాహ్మణులకి అత్యంత ప్రియమైన ఆహారం. ఆ కాలంలో ఎవరెంత ఆస్తిపరులనేదాన్ని వారికికల గోసంపద ఆధారంగానే నిర్ణయించేవారు. బ్రాహ్మణుల 'గోత్రాలు' గోవులాదారంగానే వొచ్చాయి. యజ్ఞయాగాలనేవి కూడా మద్యపానంతో బాటు గోమాంస భక్షణ ముఖ్యంగా చేసేవే.

వేదాలు మొదలుకుని హైందవ గ్రంథాలన్నీ గోమాంస భక్షణని సమర్థించాయి. ఇంటికొచ్చిన అతిధికి లేతావుని చంపి వొండిపెట్టడం గౌరవంగా అమలయ్యేది. అందుకే అతిధికి గోఘ్నః (గోవుని చంపేవాడు) అనే పేరుండేది. ఈ దేశపు మూలవాసులైన నాగజాతి ప్రజల చిహ్నమైన పాములను విచ్చలవిడిగా మంటల్లోవేసి చంపేందుకు 'సర్పయాగం' చేసిన సనాతనులు, అశ్వమేధయాగం పేరుతో అందమైన, బలమైన గుర్రంతోబాటు 600 గోవులను బలిచ్చిన బ్రాహ్మణులు, రాజసూయ యాగంలో 24 వేల గోవుల్ని దానం చేసినవారు, అగ్నిష్టోమ, వాజపేయ యజ్ఞాల్లో కూడా లెక్కలేనన్ని గోవుల్ని అగ్నిలో కాల్చితిన్నవారు, ఈరోజు అమాయక మొహాలేసుకుని వికారపు పోజులెందుకు పెడుతున్నారు?

రంతిదేవుడు యజ్ఞంలో బలిచ్చిన గోవుల కళేబరాలతో నిండిన మధ్యప్రదేశ్ లోని వో నదీ ప్రాంతాన్ని ఈనాటికీ ముద్దుగా "చర్మణ్వతి" అని పిల్చుకుంటున్నారు. అంతెందుకు? ఈనాటికీ దేశంలోని పలు దేవాలయాల్లో చట్టవిరుద్ధంగా విచ్చలవిడిగా కొనసాగుతున్న బలుల గురించీ, శాస్త్రసాంకేతిక వైపరీత్యాల కారణంగా, అడవులు – పర్వతాలు విధ్వంసం కారణంగా, ఆదివాసీ గిరిజనుల విస్థాపన కారణంగా, బడాపెట్టుబడిదారీ సంస్థల లాభాల కోసం కలుషితమై ప్రాణాలు కోల్పోతున్న సముద్ర జీవులు, పశుపక్ష్యాదులు వీటన్నింటి గురించీ పట్టించుకోని ప్రభుత్వం గో సంరక్షణా వ్రతమెందుకు చేపట్టిందో చూడాలి.

కొద్దోగొప్పో చైతన్యం పొందుతున్న తరాల్ని తిరిగి ఆత్మన్యూనతా భావంలోకి నెట్టడానికీ, సమాజమంతా అప్రయత్నంగానే 'మాంసాహారుల్ని' చిన్నచూపు చూస్తూ, 'గొడ్డుమాంసాన్ని తినేవార్ని చులకనగా చూసేలా చేయడమే బ్రాహ్మణీయ పెద్ద మనుషుల ముఖ్యోద్దేశం. ఇందుకుగాను గతంలో పవిత్రతని సాకుగా తీసుకున్న అగ్రకులాలు ఇప్పుడు పర్యావరణాన్ని దృష్టిలో పెట్టకొమ్మంటూ హితవాక్యాలు బోధిస్తున్నారు. గ్రామాల్లో చచ్చిన గొడ్లను తింటానికి నిరాకరించిన దళితుల్ని బలవంతంగా కొట్టి లాక్కెళ్ళి గొడ్లను తినిపించిన రెడ్లు, ఈ రోజుకీ రైళ్ళలో పాయిఖానాల్ని కడగడానికి, ప్రమాదాల్లో శవాల్ని తీయడానికీ దళిత బహుజనుల్నీ, పాకీ కులాలవార్నీ మాత్రమే 'రిక్రూట్' చేసుకుంటున్న కమ్మలు, ఇంతకాలంగా ఏ ఒక్క వెనకబడిన కులాల వారితో కలిసి నడవకుండానే తమని కూడా వెనకబడ్డ కులాల్లో చేర్చాలనే డిమాండ్ పెట్టిన కాపులు, పాలించేదెవరైనా ప్రపంచీకరణకి మూలమైన భావజాలాన్ని నిర్దేశించే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు... గోవుల కోసం గోల చేస్తున్నారు. అందుకే "ఒక్కో మాంసం ఒక్కో కులానికి చిహ్నం. ఒకరికి పంది మాంసం పనికిరాదు. మరొకరికి గొడ్డు మాంసం పనికిరాదు. ఇంకొకరికి ఇంకో మాంసం పనికిరాదు. ఇవన్నీ కులాలకి అంటగట్టిన చిహ్నాలం"టారు సరస్వతి గోరాగారు.

చేపల్ని అక్వేరియాల్లో చూసుకునేవారికి జాలర్లు – బెస్తలు, పిచుకల్ని పంజరంలో బంధించి సంబరపడే వారికి కోయలు – సంచారులు, జంతువుల్ని ఇనుప తలుపుల్లోని జైల్లో పెట్టి ప్రదర్శించేవారికి గిరిజనులు – వేటగాళ్ళు కిరాతకంగా ఎలా కనిపిస్తారో తెల్సిందే. చిక్కని పాలు, చక్కని పెరుగు, కమ్మటి నెయ్యి ఆరగిస్తూనే

బర్రెల్ని చూస్తూ ముఖం చిట్లించుకునేవారూ, పక్కకి తప్పుకునేవారూ, అపశకున మంటూ పనిమానుకునేవారూ, వో పక్క గోమూత్రంలో ఔషధ విలువల గురించి పాఠం చెబుతూనే గోమాంసంలోని బలవర్ధక గుణాన్నెందుకు గుర్తించరో, పైగా అపచారం అంటారెందుకో అర్థం కాదు. 'బౌద్ధం' ఆగమనంతో అహింసని గురించి అబద్దాలు చెప్పడం ఆరంభించిన హైందవం 'గోహింస' ఈ దేశంలో కొచ్చింది విజాయితీయుల వలనే అంటూ మరో విద్వేష ప్రచారం చేస్తోంది. అది కూడా నిజం కాదు. ఎప్పుడో ఋగ్వేద కాలంనాటి నుంచున్న ఆచారాన్ని చిట్టచివరి మతంగా చెప్పబడే ఇస్లామ్‌తో ముడిపెట్టి చూడటం ముస్లిములపై వికృతాలోచనల్ని పెంచడానికి మాత్రమే.

"పర్యావరణాన్ని ప్రజలకోసం కాపాడాలనుకునేవారు, పర్యావరణాన్ని ప్రజల నుండి కాపాడాలనుకునేవారు అని పర్యావరణ ఉద్యమకారుల్లో రెండు రకాలు. ప్రజల కోసమే కాపాడాలనుకున్న పర్యావరణాన్ని తెలిసో తెలియకో ధ్వంసం చేసే చర్యల గురించి ప్రజలకు హితవు చెప్పవలసిన అవసరం రావచ్చు... కానీ పర్యావరణాన్ని ప్రజల కోసం కాక ప్రజల నుండి కాపాడాలనుకునేవారికి ప్రజలు వట్టి 'న్యూసెన్స్'గా మాత్రమే కనిపిస్తారం"టాడు బాలగోపాల్ 'మనుషులు లేని పర్యావరణ'మనే వ్యాసంలో. ప్రకృతిపై ఆధారపడి జీవిస్తున్న ఆదివాసులు, గిరిజనులు, మత్స్యకారులు ఆ ప్రకృతి వనరుల్ని దోచుకునే బడాబాబుల కళ్ళకెలా కనిపిస్తున్నారో, టీ, కాఫీ, బోర్నవిటా, హార్లిక్సులు తాగుతూ, వెన్న మీగడలు, గడ్డపెరుగులు తింటూ, తోలుచెప్పులు, సంచులూ వాడుకుంటూ, కేవలం తమ స్వార్థం కోసం పశువుల వృషణాల్ని పగలకొట్టి ఎద్దులుగా 'గొడ్డు' చాకిరీ చేయించుకునేవారికి తమ అస్తిత్వాన్ని, సాంస్కృతిక చేతనత్వాన్ని నిలుపుకుందుకు పెద్ద కూరొండుకుతినే పేదలలా అగుపిస్తారు.

దేశంలోని దేవాలయాల్లోకిప్పటికీ అంటరానివాళ్ళననుమతించనివాళ్ళు, తమకు గౌరవాన్నిచ్చిన మతాల్లోకి తమని ప్రవేశింపనివ్వని వాళ్ళు, అంటరానివారికి గుడులు కట్టిన నారాయణగురు, దళిత అర్చకుల్ని తయారుచేసిన రామానుజ మతం తలెత్తిన ఈ భూమిలో ఇప్పటికీ వార్ని 'రిజర్వేషనుగాళ్ళ'గానే పరిగణిస్తున్న వాళ్ళు దేవస్థానాలన్నింట్లోనూ కడుపుల కక్కుర్తి కోసం మాత్రమే గోవుల్ని పెంచుతున్నారనేది గుర్తుంచుకోవాలి. అడ్డకత్తెర మొదలుకుని అణుబాంబు వరకూ అమెరికా అగ్రరాజ్యాల్ని అనుకరిస్తూ వాతలు పెట్టుకోడానికి అలవాటుపడ్డ మన అగ్రహార దుండగులకి ఆహారం విషయంలో వార్ని చూసి పాటించేంతటి ప్రజ్ఞ లేకపోయిందనుకోవడం



మన అమాయకత్వం. ప్రపంచ వ్యాప్తంగా గొడ్డుమాంస వ్యాపారమనేది ప్రపంచీకరణలో భాగం కావొచ్చు. కానీ, ఇక్కడది ఆత్మగౌరవ సమస్య. కులాన్ని నిర్మూలించజాలని సమాజంలోనెన్ని కమ్యూనిజాలొచ్చినా అవన్నీ బ్రాహ్మణిజానికి బలయిపోవాల్సిందే.

ప్రగతిశీల ఉద్యమాల్లో ఉన్న మేధావులకి సైతం ఈ విషయంలో స్పష్టత లేని కారణంగా అణగారిన వర్గాల గోమాంస తిండిని, అయిదు నక్షత్రాల హోటళ్ళలో జరిగే ఖరీదైన విందుల్తో పోల్చుకుని గుండెలు బాదుకుంటున్నారు. చచ్చేదెవరు, చంపేదెవరు అంతా చేయించేది నేనేనన్న పరమాత్ముడి భగవద్గీత సాక్షిగా, ఎన్నో ఘోరమైన ఘాతుకాలు చేసి రక్తపుటేరులు పారించిన బైబుల్ వాక్యంపై ఆనగా, లెక్కలేనంతమంది కుత్తుకలు తెగ్గోసి మరీ అల్లా దివ్యవాణిని వినిపించిన ఖురాన్ హదీసుల ప్రమాణంగా ఈ దేశంలోని దళిత బహుజనుల విముక్తికి నూతన మార్గమవసరం. అది గుర్తించని ఉద్యమాలు మొదలెట్టిందగ్గరికే తిరిగి తిరిగి చేరుకుంటాయి. "The bourgeois may be familiar with Marxism and Keenly critical of the social system, and anxious to change it, and yet all this leads only to an ineffectual beating of the air because he believes that man is in himself free." అంటాడు కాడ్వెల్ 'Studies in a Dying Culture' అనే తన గ్రంథలో.

గొడ్డు మాంసం భారద్దేశంలో కూడా కార్పొరేట్ సరుకుగా మారి వినిమయత్వ విధానానికి ప్రధాన వనరుగా ప్రజల్ని దోచుకునే సందర్భమొచ్చినప్పుడు దళిత బహుజనులు ఎటువైపనేది స్పష్టమే కాన భారతీయ సంస్కృతిలో వివక్షకి మూలమైన 'కులాన్ని' గురించీ, కుల నిర్మూలన గురించీ అధ్యయనం చేయటం మంచిదేమో వామపక్ష విజ్ఞులు ఆలోచించాలి. ఇప్పటిదాకా దళిత బహుజనుల రంగు, రూపు, వస్త్రాలు, నడవడిక, ఆచారాలు, సంప్రదాయాలు, సంస్కృతి, ఆట, పాట. అన్నీ కుట్రపూరితంగా అణిచేయబడ్డాయి. ఈరోజు ఆహార దౌర్జన్యాన్ని కూడా అమలు చేస్తున్నాయి. అగ్రవర్ణ పాలకవర్గాలు. ఈ అన్యాయాన్ని ఎదుర్కోవడం అవసరం.

హైందవం ఇంతకాలం మనుషుల్ని జంతువుల్లా చూస్తూ, జంతువులకి దైవత్వాన్ని అంటగట్టి, మానవత్వాన్ని మంటగలిపేందుకే పశుత్వాన్ని కప్పిపుచ్చు కొంటూ పశువులకి పవిత్రతని ఆపాదించింది. వ్యవస్థలోని నిమ్న వర్గాల వారిపట్ల అవాంఛనీయమయిన అయిష్టతని, అసహ్యాన్ని ప్రచారం చేస్తూ తమ హైందవ అప్రజాస్వామిక లక్ష్యాల్ని సాధించుకోడానికి ఎంతకైనా తెగించడం ఈ మతతత్వ

శక్తుల ప్రమాదకర వ్యూహం. ప్రజాతంత్ర శక్తులు దీన్ని అడ్డుకోవలసిన అవసరముంది. ఆహారం మనిషి ప్రథమావశరం. దానిపై పెత్తనం చెలాయించే హక్కెవరికీ లేదు. జంతువుల స్వాతంత్ర్యం గురించి మాట్లాడేవారు ఈ దేశంలో జంతువుల కన్నా నీచంగా చూడబడుతున్న వర్గాల వాస్తవ పరిస్థితుల్ని పరిశీలిస్తే మంచిది. అన్యాయాలకు, ఆధిపత్యాలకూ అలవాటైపోయిన సమాజంలో అసమానతల్ని కప్పిపుచ్చేందుకు ఎప్పుడూ ఏదోక తెలివైన ప్రయత్నం జరుగుతుంది. సమాజంలో ఎక్కువమంది నిజాలు తెల్సుకోకుండా చేసే అలాంటి కార్యక్రమాల్లో ఎక్కువశాతం ఇలాంటి నాజూకు నంగనాచి కబుర్లే నగ్నంగా ప్రచారమవుతాయి. మనుషుల రక్తమాంసాల్లో సమానతను చూడలేనివారు జంతువుల సహజ మరణాన్ని కోరుకోవడం ఎంతవరకు న్యాయమో ఆలోచించాలి. శాఖాహార ప్రహసనానికి ఇంతటితో ముగింపు పలికి సాటివార్ని ముందు మనుషులుగా చూడగలగాలి. అంటే మతోన్మాదులు మనుషులుగా మారాలి.

### కొన్ని ఉపయుక్త గ్రంథాలు


1. నవ్య భారతి పత్రిక, సంపాదకులు - అడుసుమిల్లి కృష్ణమూర్తి, హైద్రాబాద్ మార్చి 1983 నాటి సంచిక.
2. ఉపనిషత్ చింతన, ఏలుకూరి బలరామమూర్తి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైద్రాబాద్ - 1995.
3. మాంస భక్షణ పాపమా? తమ్మల గోపాలకృష్ణయ్య, కూచిపూడి, నలందా ప్రెస్ ప్రచురణ - తెనాలి - 1967
4. నిగాహ్, బాలగోపాల్, దేవులపల్లి పబ్లికేషన్స్, హైద్రాబాద్ - 2011.
5. ప్రాచీన భారతంలో ఆహారపు అలవాట్లు (Paradox of the Cow : Attitudes to Beef eating in early India) మూలం : డి.ఎన్. ఝా, తెలుగు - రవి, హెచ్.బి.టి., ప్రజాశక్తి సంయుక్త ప్రచురణ - 2002
6. Wheel of History by Rammanohar Lohia, B.R.P.C, New Delhi - 2000.
7. Interval during Politics, R.L.S. Vidyalaya Trust Publication, Hyderabad - 1985.
8. గోరాతో నా జీవితం, రచన : సరస్వతీగోరా, నాస్తిక కేంద్రం ప్రచురణ, విజయవాడ-1992.




# భావోద్యమాలు - కులాలు - స్త్రీలు

"With justice on our side, I don't see how we can loose our battle. The battle to me is a matter full of joy. The battle is in the fullest sence spiritual. There is nothing material or sordid in it. For our's is a battle, not a battle for wealth or for power. It is a battle for freedom, it is a battle for the reclamation of human personality which will continue to be suppressed and mutilated if in the political struggle the Hindus win and we loose. My final words of advice to you are educate, agitate and organize; have faith in yourselves and never loose hope. I shall always be with you as I know you will be with me.""

*– Dr. B.R. Ambedkar*

భావోద్యమాల చరిత్ర సుదీర్ఘమైంది. ఒకచోట మొదలెట్టి మరోచోట ఆపేయడానికి వీలులేంది. ఆలోచనోద్యమాలనేవి అనాదిగా సాంఘిక గమనాన్ని చైతన్యవంతంగా ప్రభావితం చేస్తూనే ఉన్నాయి. మన దేశం విషయానికొస్తే ఇక్కడ దళిత బహుజనులు, స్త్రీల పట్ల ఎప్పట్నుంచో అప్రకటిత అణిచివేత అమలవుతోంది. రాజకీయాలు మొదలుకుని ప్రసారమాధ్యమాల దాకా అగ్రవర్ణ పురుషాధిపత్యమే రాజ్యమేలుతోంది. అవాంఛనీయమయిన ఈ అనారోగ్య వైఖరికి అడ్డుకట్ట వేయకుండా ఏ విధమైన ప్రగతిశీలోద్యమాలైనా ముందుకు సాగలేవు.

మానవ సంబంధాల్లోని ప్రజాస్వామిక దృక్పథాన్ని ప్రభావితం చేసే ప్రత్యామ్నాయోద్యమాలపట్ల ప్రపంచవ్యాప్తంగా ఆసక్తి పెరుగుతుంటే, మనదేశంలో మాత్రం కుల నిర్మూలనోద్యమాలనీ, మహిళా ఉద్యమాలనీ చులకనగా చూసే అలవాటు రోజురోజుకీ పెరిగిపోతోంది. ఈ పరిస్థితి ఎంతవరకూ దారి తీసిందంటే, అభ్యుదయ సంఘాల్లో సైతం దళితుల్నీ, స్త్రీలనీ అంటరానివాళ్ళుగా చూడటం జరుగుతోంది. ప్రగతిశీలోద్యమాలుగా భావింపబడుతున్న వాటిల్లో స్త్రీల సంఖ్యను పరిగణనలోకి తీసుకుని పరిశీలిస్తే అదే తేలుతుంది.

వేటిని ఉద్యమ అంశాలుగా స్వీకరించాలో వేటిని స్వీకరించకూడదో తెలీని సందిగ్ధత అన్నిటినీ కలగాపులం చేస్తోంది. నిత్య జీవితంలో భావోన్నత దార్శనికతను పాటించనివారు ఉద్యమాల్లో నాయకులుగా ఎలా చలామణి కాగలుగుతారోనని ఆశ్చర్యం వేస్తుంది. ఈనాడు రెండు రకాల ఉద్యమకారులు మనకెక్కువ కనిపిస్తున్నారు.

మొదటి రకం కేవలం పేరుకోసం, ప్రచారం కోసం పాకులాడుతూ నాటకీయ నైపుణ్యాలు కలవారు. ఇక రెండో రకం జీవితంలోని అన్ని పాశ్వాలకి గుడ్డిగా కొన్ని ఎంపిక చేసిన సూత్రాల్ని వర్తింపచేసే కొత్త తరహా ఛాందసులు. భావోద్యమాలకి ఈ రెండు మార్గాల వల్లా ప్రయోజనం లేదు. మధ్యేమార్గమే శరణ్యం. పట్టువిడుపులు లేని ఉద్యమాలెక్కువ కాలం నిలవ్వు.

మనింట్లో స్త్రీల పట్ల మన ప్రవర్తన చాలు భావోద్యమాల్లో స్త్రీలెందుకు లేరనే ప్రశ్నకి జవాబు వెతుక్కోడానికి. హేతువాద నాస్తికోద్యమాల్లో ప్రఖ్యాతి చెందిన నాయకుల ఇళ్ళలోని వారి భార్యల, కూతుళ్ళ, మనవరాళ్ళ పరిస్థితి, బానిసల్లాగా బతికే సగటు మధ్య తరగతి భారతీయ స్త్రీలకేమి తీసిపోదనే నిజాన్ని నిజాయితీగా గుర్తిస్తే తప్ప స్త్రీలపై అప్రయత్నంగానో–సప్రయత్నంగానో అమలౌతోన్న వివక్షని గురించి ఒక అభిప్రాయానికి రాలేం. ఉద్యమాల్లో కూడా స్త్రీలని ఇప్పటికీ రెండో రకం మనుషులుగా, ద్వితీయ శ్రేణికి చెందిన జీవులుగా చూస్తున్నారనడానికి ఇంతకి మించిన తార్కాణం అవసరం లేదు.

భావోద్యమకారుల్లో ఎంతమంది వారిళ్లల్లో అహంకారం, సిగ్గూ లేకుండా ఇల్లు శుభ్రం చేస్తారో, వంట చేయడంలో భాగం పంచుకుంటారో, భాగస్వామైన భార్యనీ, ఆమె భావాల్ని (అవేవైనా) గౌరవిస్తూ ప్రజాస్వామికంగా వ్యవహరిస్తున్నారో, అసలెంతమంది వారితో పాటూ సభలకి – సమావేశాలకి భార్యాపిల్లలతో కలిసెలతారో, ఇంకెంతమంది ఆమె అభిప్రాయానికి విలువిచ్చి తమ పొరపాట్లనీ, తప్పుల్ని చక్కదిద్దుకునేందుకు ప్రయత్నిస్తున్నారో గమనిస్తే కాని నేటి బావోద్యమాల్లోని స్తబ్దతకి కారణమర్థం కాదు. ఇంట్లో వారిపని వారు చేస్కోలేని మగాళ్ళు ఊరునెలా ఉద్ధరిస్తారనేది మిలియన్ డాలర్ల ప్రశ్న.

శ్రమైక జీవన సౌందర్యాన్ని – సాంఘిక సమానత్వాన్ని గురించి లెక్చర్లిచ్చే నాయకులు ఇంటిపనుల్లో సాయం చేయడానిక్కూడా ముందుకు రాకపోవటం, ఆలోచనోద్యమాలను గురించి – భావాల మార్పిడి గురించి మాటల్దంచే కార్యకర్తలు వంటపని – వొంటిపనిని మినహాయించి మహిళలక్కూడా సొంతాలోచనలుంటాయని అంగీకరించడానికి వెనకడుగు వేయటం, ఇవి చాలు భావోద్యమాల్లోని భయంకరమైన పురుషాధిక్యతని అంచనా వేయడానికి.

ఇక అంశమేదైనా అంతర్లీనంగా మనదేశపు కులతత్వం కోరలు చాపుకునే వుంటుందనే నిజం గ్రహించాలి. కులమతాల్తో, వుద్యమసంఘాల్తో సంబంధం



లేకుండా ఈరోజు బ్రాహ్మణత్వం అంతటా కనిపిస్తోంది. ప్రముఖ దళిత నేత తన రచనలో, "బ్రాహ్మణులు సర్వశాస్త్రాలు చదివినా తమ బ్రాహ్మణాధిక్యతను వదలరు. చివరకు నాస్తికత్వాన్ని చెప్పినా బ్రాహ్మణాధిక్యతను వదలరు. మేధావి అంటే సమాజాన్ని మార్చే సూత్రాలు చెప్పినవాడు, ఉన్న సమాజాన్ని కదపలేనివాడు ఎలా మేధావి అవుతాడని" ప్రశ్నిస్తారు.

విలువల పతనాన్నే వినూత్న నాగరికతగా భ్రమిస్తున్న సమాజంలో అణగారిన ప్రజల హక్కుల్ని గుర్తించడం ఒక ప్రజాతంత్ర బాధ్యతగా భావించనంతదాకా ఈ పరిస్థితి మారదు. నిబద్దత లోపించిన నాయకత్వం పదవుల గూర్చి ఆశించినంతలా విలువల గురించి ఆలోచించకపోవడమే దీనిక్కారణం. ఈ విషయంలో కపటయిన విజ్ఞానవేత్తకంటే నిజాయితీపరుడైన సాంప్రదాయవాది నయం. అందుకే, "Betweeen an intellectually dishonest fellow who professes progressive views and the most orthodox man who prefers death to giving up his orthodoxy, i respect the latter. His views may be narrow, crude, antediluvian, but he has one supreme virtue - the virtue of intellectual honesty." అంటారు V.R. నార్ల. 'Intellectual Dishonesty' అనే విభాగంలో. నేటి ఉద్యమకారులకి సరిగ్గా సరిపోతాయాయిన మాటలు.

ఒక వ్యక్తికి గల స్వేచ్ఛను ఎంత నైపుణ్యంతో, విస్తృతితో భావప్రసారానికి వినియోగించుకుంటున్నాడనే దానిపైనే ఆ వ్యక్తి భావోద్యమ ప్రగతి ఆధారపడుంటుంది. వ్యవస్థితమయిన భావాల్ని పథకం ప్రకారం జనాల బుర్రల్లోకి ఎక్కిస్తున్న ప్రస్తుత సమయంలో ఏకరూప మూసతో సాగే భావోద్యమాల్ని ప్రత్యామ్నాయ పథంవైపు నడిపించాల్సిన అవసరముందేమో గ్రహించడం మంచిది. ఎన్నడో సంజీవ్‌దేవ్‌కి రాసిన ఒక ఉత్తరంలో, "ఇంక కొంతకాలంలో మీకు individual voices వినపడవు. individualగా think చేసే శక్తి పోతోంది. Tastes sterotype అవుతున్నాయి. Radio, Cinema, Newspaper, Ordered literature propaganda కాబోతున్నాయి. దానినించి dictatorsyhip చాలా సులభం... Uniformity నుంచి భేదించిన Thinker కి Artistకి బతుకు తెరువు ఉండదు, ఎవరూ వినరు" అంటాడు చలం.

ఒకానొక కాలంలో కొన్ని తరాల్ని నిరవధికంగా కదిలించిన ఉద్యమాల స్ఫూర్తి నాయకుల దుందుడుకు వైఖరి కారణంగా ఈరోజు తుడిచిపెట్టుకు

పోయిందంటే, నిర్మాణాత్మక భావజాల వారసత్వాన్ని అందించడంలో ఏ తరానికా తరం విఫలమౌతూనే వుందనే నిజాన్ని ఒప్పుకోక తప్పదు. పరస్పర వైరుధ్యాలతో నిండిన సామాజిక వాతావరణంలో కేవలం ఏదోక భావజాలాన్ని మాత్రమే మార్పుకు మార్గంగా భావించడం తగదు. నాస్తిక హేతువాదోద్యమాలు కులాలపైనా, మహిళల పైనా దృష్టి సారించుంటే ఈ స్థితి ఈనాడింతలా తలెత్తుండేది కాదు. సమస్య మూలాన్నీ – సారాన్నీ అధ్యయనం చేయకుండా, అవగతం చేస్కోకుండా ఆ సమస్య రూపంతో – భావంతో పోరాడటం వల్ల ఆశించిన ఫలితాలు రావు. సరిచేసుకోవాల్సిన సమస్యల్ని మనలో వుంచుకుని వ్యవస్థలోని సమస్యల్ని వెతికి పరిష్కరిస్తామనడం ఈనాటి భావోద్యమాల హాస్యాస్పద దృక్పథానికి ప్రతీక. జబ్బు మనకైతే చికిత్స జనానికెలా చేయగలం?

ఆధునిక సమాజం కులతత్వాన్ని అస్వాభావికమయిన రుగ్మతగా గుర్తించడంలో ఘోరంగా విఫలమవబట్టే వార్ని వారు నాగరికులుగా ఎంచుకునే వారిక్కూడా ఏదోమూల 'మా వాళ్ళనే' జాడ్యం నయం కానంత స్థాయిలో ముదిరిపోయింది. ఇంకా అంటరానితనమెక్కడుందనీ, ఆడాళ్ళు 'పూర్వంలా' ఎక్కడున్నారనీ బొంతకోడి కూతలు కూసే వారికిప్పటికీ ప్రతీదినం అధికారికంగానే నమోదవుతున్న పైశాచిక నేరాల్ని గురించి పట్టించుకునే తీరికుండదు. శతాబ్దాలుగా నడుస్తున్న సామాజిక వివక్షకి సంబంధించిన నిజాల్ని తెచ్చిపెట్టుకున్న ఉదారవాద బ్రాహ్మణీయ కళ్ళద్దాలతో చూస్తూ అంతా బాగుందనే అలవాటీమధ్య కాలంలో మరింత ముదిరిపోయింది.

"ఉద్యమించే హక్కును సమర్థించడం ఎంతవసరమో, నిరర్థకమైన ఉద్యమాలనూ, ఉద్యమకారుల అన్యాయమైన చర్యలనూ, ఉద్యమస్ఫూర్తిని నీరుగార్చే రెండు నాల్కల ధోరణినీ ప్రత్యక్షంగా విమర్శించడమూ అంతే అవసర" మంటాడు బాలగోపాల్. "The life of the spirit is what matters." అని 'A philosophical hypothesis' అనే వ్యాసంలో రాసిన మహనీయుడు రామ్‌మనోహర్ లోహియా, "The government corrupts and the intellectual is willing." అంటూ, 'Hypocrisies and double-talk' అనే వ్యాసంలో మేధావుల దుమ్ము దులుపుతాడు. అంతేకాదు, "Freedom from money is assuredly one of the highest aims of man and may well become a super aim of the new civilization' అని నిజమైన నాగరిక మానవుడి అత్యున్నత కోణాన్ని చూపిస్తాడు 'Materiality and Spirituality' అనే తన వ్యాసంలో.

మేధావులుగా చలామణీ అవుతున్నవారిలో సైతం భావౌన్నత్యం కొరవడినందు వలన మేథో దరిద్రమే సమాజాన్ని శాసిస్తోంది. దైనందిన జీవితంలో సాటి మనుషుల



పట్ల సమతని సాధన చేయలేనివారు మొత్తం సామాజిక గమనాన్ని మార్చేస్తామంటూ డంబాలు పలకడం ఇకనైనా మనుకోడం వ్యవస్థకి క్షేమకరం. భావోద్యమాలంటే గౌరవనీయ వైఖరి లేకుండా, కేవలం వ్యక్తిగత ప్రయోజనాల కోసం ఉద్యమాల్నాశ్రయించేవారు వారి దృక్కోణాన్ని అంత త్వరగా మార్చుకోడానికి సిద్ధపడకపోగా, దాన్నే అందరిచేతా పాటింపజేయాలని బలవంతంగా రుద్దేందుకు యత్నిస్తారు.

ఆసక్తికీ, అభిరుచికీ, అభిప్రాయాలకీ తేడా తెలీని ఈ రకం ఉద్యమకారులే ఎక్కువ సంఖ్యలో నేటి ఉద్యమాల్ని శాసిస్తున్నారు. "ఆలోచనలను, అభిప్రాయాలను హేతువాదం ద్వారా మార్చవచ్చును. కాని, అభిరుచులు హేతువాదానికి అతీతాలు. వంకాయ్ కూర ఒకరికి నచ్చనపుడు హేతువాదం ద్వారా ఆ కూరరుచిగా వుంటుదని రుజువు చేసి వారిలో ఆ కూరమీద అభిరుచిని కలిగించడం కుదరదు." అన్న సంజీవ్‌దేవ్, "ప్రపంచంలో ప్రతి విషయాన్నీ వైజ్ఞానిక దృష్టితోనే పరిశీలించసాగితే జీవితమే జీవించడానికి పనికిరాకుండా పోతుందంటూ," "మిస్టిసిజం కూడ ఒక విధమైన సూక్ష్మ హేతువాదమే"నంటాడు.

ఏది ఏమైనా, ఎప్పటికప్పుడు నూతనోత్సాహంతో కూడిన దార్శనిక దృష్టిని విస్తృతంగా వినియోగించుకుంటూ, మానవ సంబంధాల్ని మరింత ప్రీతివంతం చేసుకునే దిశగా భావోద్యమాలనేవి అభివృద్ధి చెందాల్సినవసరం వుంది. మనిళ్ళల్లోని స్త్రీలను, పిల్లలను, మనూర్లోని దళితుల్ని బహుజనుల్ని కూడా ఈ బృహత్కార్యంలో భాగం చేసుకోవడం ద్వారానే మనమనుకుంటున్నది సాధించగలం.

**కొన్ని ఆధార గ్రంథాలు :**

1. Selected speeches of B.R. Ambedkar, Blumoon Books, Delhi - 2000.
2. అంబేద్కర్ – లోహియా, కత్తి పద్మారావు, లోకాయత ప్రచురణలు, పొన్నూరు – 2014.
3. Works of Narla, Volume-10, Published by Narla family, 2004
4. లేఖాచలం (సంజీవ్‌దేవ్‌కు చలం రాసినుత్తరాలు), సంజీవ్‌దేవ్ సాహితి, తెనాలి – 2008.
5. నిగాహ్–2 (ఫీల్డ్‌నోట్స్ ఆన్ డెమోక్రసీ), బాలగోపాల్, దేవులపల్లి పబ్లికేషన్స్, హైద్రాబాద్–2014.
6. Collected Works of Rammanohar Lohia (all volumes), Anamika Publishers, Delhi-2011.
7. తమ్మపూడి (సంజీవ్‌దేవ్ స్వీయచరిత్ర), రాజాచంద్ర ఫౌండేషన్ ప్రచురణ, తిరుపతి–2011.

# ముగింపు

"The world that we must seek is a world in which the creative spirit is alive, in which life is an adventure full of joy and hope, based rather upon the impulse to construct than upon the desire to retain what we possess or to seize what is possessed by others. It must be a world in which affection has free play, in which love is purged of the instinct for domination, in which cruelty and envy have been dispelled by hapiness and the unfettered development of all the instincts that build up life and fill it with mental delights. Such a world is possible; it waits only for men to wish to create it."

– *Bertrand Russel*
Roads to Freedom, P-210

సమాజం గురించి యువత పట్టించుకోడంలేదంటూ అపసోపాలు పడే తరాన్ని చూస్తే నవ్వొస్తోంది. నేననేక సభల్లో చెప్పినట్లు ఈ తరాల ఉదాసీనతకి కారణం ముందు తరాలే. ఆ తరాల నిర్లిప్తతే. దాన్ని నిజాయితీగా గుర్తించే ప్రయత్నం చేయకుండా ఉద్యమాల్లో స్తబ్ధత తాండవిస్తోందంటూ గుర్తుకొచ్చినప్పుడల్లా వాగాడంబరాన్ని ప్రదర్శించుకోడం సరికాదు. ఇన్నాళ్ళబట్టీ సంపాదనలో పడి కుటుంబ భద్రతకి ప్రాధాన్యమిచ్చిన కుహనా మేధావులు, ఉద్యోగ విరమణ చేయగానే హఠాత్తుగా ఉద్యమకారులవతారమెత్తి సమాజం చెడిపోతోందంటూ వగరుస్తుండడం కద్దు. ఇంటినొదిలిపెట్టి గాలికి తిరుగుతూండమని చెప్పడం నా ఉద్దేశం కాదు కానీ, వారికున్న సామాజిక భద్రత గురించిన భయం ఏ తరంలోని యువతకైనా ఉంటుందని మాత్రమే నా భావం. ఇంకా చెప్పాలంటే వ్యవస్థ గూర్చిన వీరిబాధ వొకరకమైన నాటకమే తప్ప నిజం కాదు. పనిగట్టుకు ఉపన్యసించే వీరి ఊకదంపుడు మాటల్లో నిజాయితీ లేదు.

వామపక్ష నాస్తిక హేతువాద భావోద్యమాలు మొదలుకుని కులనిర్మూలన, హక్కుల, మద్యపాన వ్యతిరేక, అవయవదాన, పర్యావరణోద్యమాల దాకా ఇదే తంతు వర్తిస్తుంది. యువతరం ఈ జంగిలి నాయకుల ఎంగిలి పదజాలాన్ని వల్లిస్తూ వీరి వెనక జైజైలు కొడుతూ నడవడం లేదనే అకారణ అసూయే తప్ప సకారణ స్పందన



వీరికి లేదనేది నా వాదన. సభలు – సమావేశాలకి వీలైనంత మందెక్కువ జనాన్ని రప్పించగలగడమే ఉద్యమ విజయానికి ప్రాతిపదికైనచోట, పత్రికల్లోను, ఫేస్‌బుక్కుల్లోనూ ఫోటోలు పంచుకోవడం కోసం వంతులవారీగా ఎగబడ్డమే విప్లవాచరణగా చలామణీ అవుతుంది. మనకంటూ లేని సరుకుని గురించి నిరంతరం కలలుకంటూ, కొద్దోగొప్పో అదున్నవార్ని చూసి మానసికంగా అసూయపడుతూ, దాన్ని కప్పిపుచ్చుకోడానికి నిత్యం రాని నవ్వుని మొహాన పులుముకోవడం కోసం మనస్సాక్షితో రాజీపడ్తూ నటించడానికి మించిన నైచ్యం మరోటి లేదు.

తమ కూతల్ని, రాతల్ని భరించడమే తిరుగులేని అభ్యుదయ లక్షణమనుకునే అల్పులకు ఆడంబరలంకార వేదికలపై, హాస్య ప్రాసల ఉపన్యాసాలపై, రచనా వ్యాసంగ ప్రచురణలపైనున్న ఆసక్తి మానసిక విజ్ఞత మీద, శారీరక కృషిమీద వుండదు. త్యాగాలకి సిద్ధపడిన కార్యకర్తల జీవితాల్ని మరుగుపర్చడానికి ఖరీదైన కార్యక్రమాలు చేస్తుంటారీ మంద. వీరి కాలక్షేపపు దండకాల్ని తలకెత్తుకోనందుకే ఇతరులపై మండిపడ్తూ సమాజం చెడిపోతోందని ఆడిపోసుకుంటారు. తమ మాట వినని వారంతా మూర్ఖులేననే మేధోశోభ ఈ మధ్య ఇంకా పెరిగిపోయింది. సామాజిక వుద్యమాల్లో ఎన్నడూ ఏ మాత్రం పాలుపంచుకోని పండితులు తోచిన శిష్యుల్తో సంతలేర్పర్చుకుని భుక్తాయాసం తీర్చుకుంటూ ఎవర్నూలో తెలీక వార్ని వారే అనుకోలేక యువతని తిట్టడం నేర్చుకుంటున్నారు. యువత తప్పుదారి పట్టిందనడం ప్రతి ఉద్యమానికి ఊతపదమైపోయి అస్తిత్వ అర్హతగా చూడబడుతోంది.

వీరికర్థం కాన్దేంటంటే సమాజం అదేదైనా కొంతలో కొంత గతం కంటే ముందుకు పురోగమిస్తూనే వుంటుంది. ప్రతీ వ్యవస్తలోనూ వ్యవస్థీకృతమైన వ్యవహారాల్ని పాటించేవారూ సమర్థించేవారూ అత్యధిక శాతం మందుంటే, వాటికి వ్యతిరేకంగా ఆలోచనా స్వేచ్ఛను ఆచరించేవారు కొందరుంటారు. అజ్ఞాతం నుంచి విజ్ఞతవైపు సాగడాన్నే మానవాళి అభివృద్ధిగా మనం పరిగణించాలి. ఇంకా చెప్పాలంటే, ముందు తరాలకంటే ఈరోజు యువతలో చైతన్యం బానే వుంది. మనమనుకున్న భావజాలానికి సంబంధించిన సమగ్ర సమాచారం లేనంతలో సమాజం అజ్ఞానంలో వుందనుకుంటే అది మన అర్థజ్ఞానానికి ప్రతీకవుతుందే కాని వ్యవస్థ నిజస్థితికి ప్రాతిపదిక కాదు. ఇదవగతం చేస్కుని ఉద్యమాలనేవి మౌనంగా కార్యాచరణ కావించుకునే సామాజిక దృక్పథాలుగా సమాజంలో మిళితమవడానికి చూడాలే కాని వికారమైన నైరాశ్య దృక్కోణాలుగా కాదు.

నిజాల్చెప్పడం బురద జల్లడంగా ప్రచారమయ్యే ప్రాంతాల్లో బూతుల్తిట్టడం బుద్ధిచెప్పడంగా తీసుకోవడం జరుగుతుంది. ఒక్క వ్యాసంతో మొదలైన ఈ నా

రచనని ఇక్కడిదాకా చేర్చి కూడా ప్రచురించాలా వొద్దా అనే తడబాటుతో సందిగ్ధంలో పడ్డాను. ఈ ప్రయత్నం లౌకికవాద తాత్వికోద్యమ ఉన్నతికుపకరించాలనే నా కోరికని, అలౌకిక మతవాద శక్తులకి అప్రయత్నంగా బలాన్నిచ్చే విమర్శగా మారకూడదనే ఆలోచన వెనక్కిలాగింది. అయితే, నే చెబితే వచ్చే పరిణామాల కంటే కూడా మౌనంగా వుంటే తలెత్తే ప్రమాదాలే నన్ను ముందుకు నడిపించాయి. పుంతకో పుంజెడు మందిగా మిగిలిన భావోద్యమాల్లోని యోచనాపరులు నా అభిప్రాయాల్ని, ఆలోచనల్ని పరిగణనలోకి తీస్కుంటారనీ, భావోద్యమాల్ని బలపర్చే క్రియాశీల సద్విమర్శలుగా వీటిని స్వీకరిస్తారని మనస్ఫూర్తిగా ఆశిస్తున్నాను. మిత్రులు, అమిత్రులంతా కూడా అలాగే ఆశిస్తారని ఆకాంక్షిస్తున్నాను.

మొన్నో మిత్రునికి రాసిన లేఖలో పేర్కొన్నట్లు గెలుపోటముల మీదాశా, గెలుకులాటల మీద ధ్యాసా లేని నాలాటివాడ్ని అకారణంగా కెలకటం మంచిది కాదనే భావనతోనే గతంలో కొందరిపైనా, సమకాలీనంగా మరికొందరిపైనా ఘాటుగా స్పందించాల్సొచ్చిందేకాని ఏ వొక్కరిపైనా నాకు ప్రత్యేకంగా ఈర్ష్యాద్వేషాలుండి కాదు. నిజంగా వుండాల్సిన సందర్భాల్లోనే కూడగట్టుకోడం చాతకానివాడ్ని. భావోద్యమాలకో కొత్త బెడదగా తయారవ్వాలనే తీట నాకు లేదు. మంచో చెడో మనకనిపించిన మార్గాల్లో కొందరం కొద్దిపాటి విభేదాల్తో పరిమితులు విధించుకుని ముందుకెళ్తున్నాం. కాన సాటి ఉద్యమాల్నీ తోటి ఉద్యమకారుల్నీ అనవసరంగా కించపరచడం భావ్యం కాదనే భావనతోనే న్యాయంగా నడవడముత్తమమని నా అభిప్రాయం. నాస్తిక హేతువాద భౌతికవాద ఇతర ప్రగతిశీలోద్యమ సంఘాల మిత్రులందరికీ ఇదే విషయాన్ని మరోసారి తెల్పుకుంటూ సెలవు తీస్కుంటున్నాను.

**"Spirit, that made those spirits dare**
**To die, and leave their children free,**
**Bid time and nature gently spare**
**The shaft we raise to them and thee"**

– Emerson

ఛఛఛ



# అనుబంధం

## గౌరవ్ ఇతర రచనలు – పరిచయం




### ప్రజాస్వామ్య పతనం

**(The Decline of Democracy)**

బిత్తరచూపులు చూస్తూ బిచ్చమెత్తుకునే బాలలోకవైపు. బెంజికారులో నుండి కాలు కింద పెట్టని బిలియనీర్లు ఇంకోవైపు ఎందుకున్నారు? నాలుగు మెతుకులు కోసం మనసు చంపుకుని ముష్టెత్తుకుంటోన్న మనుషులోకపక్కా, నాలుగ్గోడల మధ్య మరో సృష్టి గావించి అందులోనే కులుకుతోన్న మిలియనీర్లు మరో పక్కా ఎందుకున్నారు? నిత్య నూతనత్వాన్ని నిబిడీకృతం చేసే అద్దాల మేడలోకవైపు నిరాశ, నిస్పృహలు నిండిన నిజ జీవిత కథనాలు మరోవైపు, మన నగరాల్లోంచి ఎందుకు నిత్యం తొంగి చూస్తున్నాయి? శాస్త్ర సాంకేతిక రంగాల్ని సైతం తన వశం చేసుకున్న మానవ మేధస్సు మరో మనిషి కడుపు నింపడానికి ఎందుకు పనికిరావడం లేదు? విశ్వవిజ్ఞానాన్ని తనవైపు తిప్పుకో గలిగిన మనిషి మస్తిష్కం తోటి మానవుడికి మనగలిగే మార్గాన్ని ఎందుకు చూపెట్టలేక పోతోంది? బాల్యంలో పాలకి, ప్రాయంలో శ్రమకి, వయసయిపోయాక వృద్ధాప్యంలో మంచానికి, మిగిలింది మట్టిలో కల్సి మాయమయి పోవడానికే మనుషులుగా మనం మసలుతున్నామా?

బతికి చచ్చేదాన్ని జీవితమంటారు. చస్తూ బతికేదాన్ని బానిసత్వమంటారు. బతకలేక – చావలేక పడుండడాన్ని పౌరసత్వమంటారు. ప్రస్తుతం మనమున్న స్థితదే. దాన్ని గతిమార్గం పట్టించడమే అక్షర లక్ష్యం. ఈ భూమిపై పట్టెడు మెతుకులు కోసం జరిగే ప్రతి పోరాటంలోనూ పేదవాడి పక్షాన నిలబడేదే నిజమయిన అక్షరం. బద్ధమయిన అక్షర తత్వమెప్పుడూ భవితవ్యమే. ప్రజాభ్యుదయమే. అలా భవిష్యత్తు కోసమే బతికే ప్రతి అక్షరానికీ చీకటి చరిత్ర పొరల్లో దాగున్న చెరగని దృక్కోణాలన్నీ దారి చూపెడుతూనే ఉంటయి. మౌనపు అట్టడుగు మార్గాల్లో మెలిగే భావాలన్నీ దాని భావచైతన్యపు బాటలో భాసిస్తూనే ఉంటాయి.

అటువంటి అజరామర పథాలే అక్షరాల ఉనికిని నిర్దేశిస్తాయి. అక్షరాల్లోని ఉష్ణపు స్థాయిని నిర్ణయిస్తాయి. అణచబడిన ఆశల సౌధాల్లోని అజ్ఞాత ఆశయాలే అక్షరాలకి అడుగులు నేర్పిస్తాయి. స్వార్థంతో విరామం లేని యుద్ధంకోసం సృష్టించబడే అద్వితీయమయిన అక్షరయాత్ర ప్రయాణమెప్పుడూ విజయం వైపుగానే సాగుతుంది. దిగ్విజయంగానే ముగుస్తుంది. ఆయుధాల్ని అంతం చేయగలిగిన ఆయుధాలెన్నో పుట్టాయి గానీ, అక్షరాల్ని జయించగలవింకా పుట్టలేదు. ఎప్పటికీ పుట్టలేవు.




### అరాజకత్వం అంటే ఏమిటి?

**(What is Anarchism?)**

ప్రస్తుతం నడుస్తున్నది క్షీణిస్తున్న ప్రభుస్వామ్యం. ధ్వంస మవుతున్న ధనస్వామ్యం. ఈ వ్యవస్థది మరణించబోయే సుఖరోగి దశ. కనుకనే వ్యక్తిగత సుఖాలన్నీ సమిష్టిగా మనం భావిస్తుంటాం. అందంగా కనిపించే భ్రాంతుల్ని ఆలింగనం చేసుకుని వాటికి అప్రయత్నంగానే అమ్ముడుపోతుంటాం. మనకంటూ సొంతంగా శరీరాలు తప్ప

అంతరాత్మలుండవు. అస్తిత్వాలే కాని వ్యక్తిత్వాలుండవు. బతుకీడ్చడమే జీవితమనుకుంటూ జీవచ్ఛవాల్లా నలుగురితో పాటు నలుగుతుంటాం. నలుగుతూనే నశిస్తాం. ఇక వెలిగించుకుని వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుకునే తీరికెక్కడిది మనకి? తీరిగ్గా అరువు తత్వాలన్నింటినీ మిశ్రమత్వంగా మనలో మలచుకోవడం తప్పా, మనకి పూర్తిగా మన గురించి ఆలోచించుకునేందుకే తీరిక లేదు. ఇక సమయాన్ని సమాజం కోసం కేటాయించడమనేదిక్కడ అప్రస్తుతం. ఇన్ని అలౌకిక భావాల్ని, పారలౌకిక లక్షణాల్నీ పారద్రోలి ప్రగతిబాట పట్టినప్పుడే నిజమైన ప్రజాస్వామ్యం సాధ్యపడుతుంది.




## సాంఘికతత్వం-వైప్లవ మార్గం

### (Social Philosophy-Revolutionary way)

ప్రశ్నించేది విజ్ఞానం. అనుసరించేది అజ్ఞానం. అజ్ఞానాన్ని అది అజ్ఞానం కాబట్టి విసర్జించాలి. విజ్ఞానాన్ని విజ్ఞానం కాబట్టి స్వీకరించాలి. అత్యధికమందిచేత అంగీకరించి ఆమోదించ బడినంత మాత్రంలో అజ్ఞానం విజ్ఞానమూ అయిపోదు ఎవరూ ఆమోదించకుండా తిరస్కరించినంత మాత్రాన విజ్ఞానం అజ్ఞానమూ అవదు. అందరూ ఒప్పుకున్నంతలో అసత్యం సత్యం కాదు. ఎవరూ ఒప్పుకోనంతలో సత్యం అసత్యమూ కాదు.

అజ్ఞానం అంధకారానికి చిహ్నం. విజ్ఞానం విప్లవానికి చిహ్నం. విజ్ఞాన మూలం తత్వం. తత్వానికి తార్కాణం సత్యం. సత్యానికి అన్వేషణ ముఖ్యం. అలాంటి సత్యాన్వేషణ గమనాన్ని గ్రాహ్యం చేసుకున్న వ్యక్తిత్వాలకి పొగరనేది పొగడ్తలవల్లో, తెగడ్తలవల్లో వచ్చినది కాదు. అది అప్రయత్న ఆభరణమే తప్ప అలంకారప్రాయమో, అహంకార చిహ్నమో కాదు. ఆకతాయితనాన్నే ఆత్మవిశ్వాసంగా భ్రమసే అల్పుల గల్లాపెట్టెల బుర్రలకి అది అందదు.

అంతరాత్మని అహంభావాలకి తాకట్టుపెట్టి ఆకాశంపై బురద జల్లడానికి ప్రయత్నించడం అవివేకం. నింద నింగినంటదు. నలుగుర్లో వేర్పాటుతనాన్ని ప్రదర్శిస్తూ తాము భిన్నంగా బ్రతుకుతున్నా మనుకోవడం ఆధునిక బానిసత్వం. ఇది వెర్రికి చిహ్నం కానీ వ్యక్తిత్వానికి కాదు. వ్యవస్థతో వంతపాడుతూ నలుగుర్తో నలగడమే నయమనుకోవడం పురాతన బానిసత్వం. ఇది నంగిరికి చిహ్నం కానీ నైతికతకి కాదు. వింత, వికారం, లాంటివన్నీ మన వెకిలితత్వాన్ని చెబుతాయి తప్ప వ్యక్తిత్వాన్ని వ్యక్తపరచవు.

ఈ ఇరురకాల భావబానిసలూ మేమిలాగే ఉంటామంటూ సగర్వంగా ప్రకటించడానికి ప్రయత్నించేది సిగ్గుమాలిన సూత్రీకరణల్నే కానీ నిగ్గుతేల్చిన నిర్ణయావిష్కరణల్ని కాదు. అరువు తత్వాన్ని అందంగా రంగరించుకుని ప్రదర్శించేది మొద్దుబారిన మనస్తత్వాల్నే తప్ప హద్దులెరిగిన మానసిక స్థైర్యాన్ని కాదు. ఇటువంటి పిడత వ్యక్తిత్వాల ప్రవర్తనకీ, సిద్ధాంతాలకీ ప్రత్యేక వ్యాఖ్యానం అక్కర్లేదు. పిచ్చికి ప్రత్యేక ప్రదర్శన అవసరం లేదు. దానికదే స్వీయపైత్యాన్ని ప్రదర్శిస్తుంటుంది.

సద్విమర్శల్ని తప్ప సామరస్యం – సమాలోచనా లోపించిన ప్రతీ వ్యాధి ప్రకోపిత పైత్యాన్నీ పెద్ద మనసుతో స్వీకరించేటంత 'స్పోర్టివ్‌నెస్' నాకు లేదు. ఇకపై రాదు. వెల్ అండ్ గుడ్!






## ఒక నాస్తికుడి నామా

నిజానికి నమ్మేవారితో నిమిత్తం లేదు. అబద్ధానికి అంగీకరించిన వారితో అనుబంధమూ లేదు. మనుషులుగా ఏది నిజమో – ఏది అబద్ధమో, ఎలా నిజమో – ఎలా అబద్ధమో, ఎందుకు నిజమో – ఎందుకు అబద్ధమో, ఎప్పుడు నిజమో – ఎప్పుడు అబద్ధమో, బేరీజు వేయలేని మన వివేకం వృథా.

మతాలకి ప్రత్యామ్నాయంగా మార్క్సిజాలు, మానవ వాదాలు బయలుదేరి మనిషి స్వేచ్ఛకు సమాధి కట్టాయి. మతాధిపతులకు పోటీగా నాస్తిక, హేతువాద శిఖామణులు సైతం కొలువుదీరి తమ దుకాణాల అమ్మకాలు పెంచుకుంటున్నారు. అసలనేది లేని వీరంతా కొసరుకి కొమ్ము కాస్తున్నవారే.

అధ్యయన రచనలు కూడా ఆచరణలో భాగమేనని ఊగేవారూ, ఆచరణతో సంబంధంలేని అధ్యయనాలు, అక్షర వ్యాసంగాలు ఎందుకని పేలేవారు, ఇరువురూ ఇరుకునే సరుకుగా భావిస్తూ నిజాలకు భయపడి బెరుకుగా జీవిస్తున్నారు. ఆంతరిక అల్పత్వం స్వతహాగా వీరి సైద్ధాంతిక లోపం.

మనం జీవిస్తున్నామని ధృవపరిచే కొండగుర్తులని మొండిగా తగిలించుకుని బండిలా ముందుకు సాగుతూ, పుట్టిన కులానికి కట్టుబడి, చెప్పిన మతానికి ఇష్టపడి, తోచిన వృత్తికి బోర్లాపడి, దొరికిన బాంధవ్యాలకు బాకీపడి, సంఘానికి సాక్షాత్కార పడడమే సగటు జీవి జీవితంగా ఎంచబడుతోంది.

సత్యం పేరుతో నచ్చిన తత్వాన్ని నెత్తికెక్కించుకుంటూ, జ్ఞానమంటూ మెచ్చిన తర్కాన్ని తలకి రుద్దుకుంటూ, మన చాంఛల్యాన్ని చాటుకునే స్వేచ్ఛ మనకున్నట్లే, ఎదుటివారి చిత్తాన్ని సైతం ఆహ్వానించాలనే ఔచిత్యాన్ని మరచి, మనకు నచ్చిందే నందని – మనం మెచ్చిందే పందని పరవశించడం కద్దు.

ఏది నిజమో ఏది కాదో నిజాలను బట్టి కాక ఇజాలను చదివి తెలుసుకోవా లనుకోవడం బుద్ధిజీవుల దౌర్భాగ్యమైతే, అది ఎలా నిజమో ఎందుకు నిజమో తమ బుద్ధిని బట్టి కాక, బుద్ధిలేమి జీవులని అనుసరించి తెలుసుకోవాలనుకోవడం సామాన్య జనాల సాంప్రదాయక జాఢ్యం.

జ్ఞానంపై గుత్తాధిపత్యానికి మేధస్సనేది ఏ ఒక్కరి సొత్తూ కాదు. కాబోదు!




## ప్రజాస్వామ్య ప్రస్థానం (The Journey of Democracy)

అజ్ఞానానికి అనేక కారణాలున్నాయి. జ్ఞానాన్ని ఆర్జించాలనే ఆర్తి లోపించడం అందులో ప్రథమమైంది. ప్రధానమైనది. అర్ధదశాబ్దం కిందట నన్నొక నక్సలైట్‌గా ప్రచారం చేసిన ప్రబుద్ధుల బాగోతం నాకిప్పుడు జ్ఞాపకం వస్తోంది. ఆ విషయం గురించి బహిరంగంగానే నన్ను ప్రశ్నించి భంగపడిన పుంగవులూ ఇంకా నా స్మృతి పథంలోనుంచి చెరిగిపోలేదు. అపుడప్పుడే పుట్టుకొస్తున్న కొత్త పరిపక్వతని పూర్వం చేసుకొనే దిశగా సాగిన ప్రస్థానంలో నా తాత్కాలిక తాత్విక మజిలీల్నే నా తత్వంగా భ్రమసినవారున్నారు. అంతే కాకుండా నా రచనాశైలి, వ్యక్తిగత వ్యవహారశైలీ

కొందరు మిత్రులతో అపార్థాలకు తావిస్తున్నట్లు తెలిసింది. వారి అస్పష్ట అభిప్రాయాలలో స్పష్టత చేకూర్చడం అవసరమనిపించింది. నా మొదటి రచనలో నన్ను మార్క్సిస్టుగా – కమ్యూనిష్టుగా భ్రమించినవారున్నారు. ఆ తరువాత నేనొక తీవ్రమైన, అతిప్రమాదకరమైన అరాజక వాదినని నమ్ముతున్న వారున్నారు. అటుపిమ్మట నేను నాస్తికుడినని, హేతువాదినని, రాడికల్ హ్యూమ నిస్టునని, జోరుగా ప్రచారం చేస్తున్న జోరీగలుండనే ఉన్నారు. ఒక దశలో ఇవన్నీ నా యిజాలే అయినా, నిజానికి నేనేవాదినీ కాను. మానవుడిని వాదనలకి పరిమితం చేసే భావాలకు బద్ధ విరోధిని. భావవిప్లవమొకటే మనిషి అభ్యున్నతికి అగ్రాంగం అని భావిస్తున్నవాడిని. ప్రస్తుత రాజకీయ విధానాలకి ప్రత్యామ్నాయంగా అరాజకత్వాన్ని అర్థవంతంగా పరిచయం చేయాలనుకున్నానే తప్పా ఆద్యంతం అరాజకత్వాన్ని పట్టుకువేలాగే ఉద్దేశం కూడా నాకు లేదు. సర్వామోదం ఎప్పుడూ నాకు సమ్మతం కాదు. ఆరోగ్యవంతమైన విమర్శ దర్శించని విజ్ఞానం వ్యవస్థీకృతమౌతుంది. అటువంటి జ్ఞానం అవివేకాన్ని సంతరించుకొని ఉన్నచోటునే కూర్చుండిపోతుంది. అదే అజ్ఞానం, మతావిర్భావాల మూలం ఇదే. నిరంతర జ్ఞానతృష్ణ మాత్రమే తత్వసాధనకి – సత్యశోధనకి మార్గం సుగమం చేస్తుంది. అందుకు మనిషికి మనిషిని గురించిన ఆదుర్దా తప్పా మరే సిద్ధాంత ముద్రా, వేదాంత దురదా అవసరం లేదు. ఇంతా చదివి ఇంతకీ మీరేపక్షమో చెప్పండంటూ ప్రశ్నించే ప్రబుద్ధులకి ఏమని చెప్పగలను? వారి బుద్ధి ఇంతేనని మౌనంగా సరిపెట్టుకోవడం తప్పా!




## అస్తిత్వం – అరాజకత్వం (Existence - Anarchism)

ఆర్థికంగా స్థిరపడి అక్షరాలకి ధర నిశ్చయించుకోమన్న వాళ్ళు, అక్షరాల్ని అమ్ముకొని ఆర్థికంగా నిలదొక్కుకొమ్మన్నవాళ్ళూ, అసలవ్వన్నీ నీకెందుకంటూ ఆడిపోసుకున్న అభిమానులు, అందిరలా ఉండలేవా? అంటూ అంతెత్తులేచే చిద్విలాస పరులూ, ఇల్లు చక్కదిద్దుకున్నాక సంఘం గురించి ఆలోచించమంటూ సలహాయిచ్చే శ్రేయోభిలాషులూ, ఇలా నా మంచి కోరిన వారందరికీ మనస్ఫూర్తిగా వందనాలు తెలుపుకోగలనే కాని అంతరాత్మతో సంపూర్ణంగా విబేదించి నన్ను నేను మోసం చేసుకోలేను. ఎప్పటికప్పుడు కొత్త చేతనత్వానికి సిద్ధపడే నా స్వభావం తాత్కాలిక బెదిరింపులకి తలొంచిందంటే దానర్థం మరొకరిని కష్టపెట్ట కూడదనే తప్ప మానసికంగా ఇష్టపడి మాత్రం కాదనేది స్పష్టం.

అన్యాయాలు, అక్రమాలు పెరిగిపోతున్నాయంటూ కుదిరినప్పుడల్లా కబుర్లు చెప్పుకొనే వారి కోవలోకో, తోచినప్పుడల్లా మంచికి ఇవి రోజులు కావంటూ గొంతులు చించుకునే వారి తోవలోకో, అడపాదడపా పనికిమాలిన ఆవేశాలతో అరిగిపోయిన నినాదాలెత్తుకొనే ప్రబుద్ధుల వరుసలోకో అల్లంత దూరంలో నిలబడి ఆచరణో... ఆచరణంటూ అరిచి గీపెట్టే బడుద్దాయి బారులోకో నేను కూడా చేరిపోయి నలుగురితో నారాయణ, కులంతో గోవింద అనుకొనే మందతో సహా అమ్ముడుపోయి అంతరాత్మకి పంగనామాలు పెట్టుకోదలచుకోలేదు. నిత్యం బుగ్గిపాలవుతున్న కోట్లాదిమంది యువజనుల వర్తమాన జీవితాలకన్నా నా భవిష్యత్తేమి గొప్పది కాదు. అయినా గొప్పతనం కాలానికి ఎదురీదిన వ్యక్తిత్వాల్లో వెతకాలే కాని, కుదేలుపడిన బతుకుల్లో కాదు.

కదలిక చైతన్యానికి, నిర్లిప్తత నిర్జీవానికి చిహ్నాలు. కాబట్టి, ఇప్పటికైనా బడలిక వదిలి కదలడానికి ప్రయత్నించడం మనుషులుగా మన అస్తిత్వాన్ని నిరూపించడానికి పనికొచ్చే కనీస ప్రమాణమేమో!






## మద్యంపై యుద్ధం (War on Liquor)

పుస్తకం పూర్తి చేయమని తొందరపెట్టిన మిత్రులందరూ అంతిమంగా మౌనం పాటించడం వలన ముద్రణా భారం మోయలేక కొంతకాలం పక్కన పెట్టాల్సి వచ్చింది. మనతో అంటకాగుతున్న వారు మాత్రమే మంచి వారనే ధోరణి క్రమంగా మనమున్న సంఘాలకి బాకా ఊదని బాపతంతా బైటివారుగా భావించి, మనది కాని మంచితనంతో అంటరానితనాన్ని పాటించే దశకు చేరుతుంది. అంతమాత్రంలో కొంపలేవీ మునిగిపోవు కానీ వ్యక్తుల మధ్య మిత్ర సంబంధాలు చెప్పుకోలేని విధంగా దెబ్బతింటాయి.

వ్యసనాల విషయంలో సరిదిద్దుకోగల తప్పుల్ని వ్యక్తుల విషయంలో సరిచేసుకోవడంలో విఫలమవడం వలన నేను కోల్పోయిన ఆత్మిక సంబంధాలే బహుశా మనిషి పట్ల నా బాధ్యతని మలచగలిగాయని అనుకుంటాను. అందుకే సామాన్యుల జీవితాలలో ప్రదర్శించబడే క్రూరమైన ఉద్రేకాలకి ముఖ్య కారణం 'మద్యం' అనే మహమ్మారి కావడం మనుషులుగా మన దుర్భలత్వానికి చిహ్నామని అంగీకరించడానికి ముందుకు రానంత కాలం జన జీవితాన్ని ఈ వ్యసనమే శాసిస్తుందనడం అతిశయోక్తి కాదనుకుంటాను.

ఎవర్ని కించపరచాలనో, కిందస్థాయికి దిగజార్చాలనో నేనేదీ రాయలేదు. చేయలేదు. నా దేశాటనకి – పుస్తక పఠనానికి ప్రయోజనమంటూ ఏదైనా ఉంటే అది సామాజికమైనదే కానీ స్వాభావికమైనది కాదు. తమ అస్తిత్వానికి అసూయనే ప్రామాణికంగా పెట్టుకుని వ్యక్తిత్వాన్ని మద్యం కోసం దిగజార్చుకున్న ప్రబుద్ధులందరూ నాపై తోచినప్పుడల్లా బురద జల్లుడు కార్యక్రమం అమలు చేస్తున్నప్పుడు కూడా మౌనమే సమాధానమనుకుంటాను నేను. ప్రేమించడం నేర్చుకున్నంతగా ద్వేషించడం నేర్చుకోకపోవడం వ్యక్తిగా నా లోపమేమో.

నేను నిజమని నమ్మినదాన్ని సాధ్యమైనంత స్పష్టంగా వీలైనంత నిజాయితీతో వ్యక్తీకరించడానికి ప్రయత్నించడం వలన మాత్రమే ఏదో మేరకు సమాజంతో సత్సంబంధం నెరపడం జరుగుతుందని నమ్ముతున్నాను. అందుకే ఇజాల గొడవలేని నిజాలకే అక్షరరూపం ఇస్తున్నాను. రచనా వ్యాసాంగాన్ని పరిమిత ప్రచార సాధనంగానే నేను తలుస్తున్నాను. నా ఈ మాటలేవీ తుది తీర్పులు కావనే భావనతోనే చదువరులు దీన్ని గ్రహించాలని మనవి చేసుకుంటూ, నే చేసిన కొన్ని తప్పులనైనా ఈ రకంగా ఒప్పుకుని ప్రాయశ్చితం చేసుకుంటున్నాను.




## మతానికి మరణశాసనం – మనిషికి పునరుజ్జీవనం

నిత్య జీవితంలో సైన్సు ఫలాన్ని అనుక్షణం అనుభవిస్తూ కూడా నిత్యం మూఢ నమ్మకాలపై ఆధారపడే వ్యాధి వ్యవస్థలో బాగా ముదిరిపోయింది. శాస్త్ర విజ్ఞాన ఆవిష్కరణల ఆసరా లేకుండా కాలు కదపలేని మనం, అశాస్త్రీయంగా ఆలోచిస్తూ అతీత శక్తుల్ని గుడ్డిగా ఆరాధించడానికే అలవాటుపడ్డాం. రాకెట్టు యుగంలో బతుకుతూ కూడా లాకెట్ల మహిమలు నమ్ముతూ సమాజంలోని భావితరాలకు వైజ్ఞానిక ద్రోహం చేస్తున్నాం. దెయ్యాలు, భూతాలు, ఆత్మలు, ప్రేతాత్మల్ని గురించిన అబద్ధపు కథల్నే అందంగా మన వారసులకి అందిస్తున్నాం. వ్యక్తిగత సమస్యలకి రోజువారీ పూజలు, శారీరక రోగాలకి రకరకాల తావీజులు, మానసిక పైత్యాలకి మంత్ర తంత్రాలు,

సామాజిక సంక్షోభాలకి స్వామీజీలు – అమ్మలు– బాబాలు, రాజకీయ జారత్వానికి జ్యోతిష్యం, వాస్తు, ఉంగరాలు, వర్షాలకి – వాతావరణ కాలుష్యానికి కట్టగలిపి ఖరీదైన యజ్ఞయాగాలు... మొదలైన దొంగ వ్యాపారాలన్నీ ప్రజల మానసిక బలహీనతలపై మూకుమ్మడిగా దాడిచేస్తూ రాజ్యమేలుతున్నాయి. ప్రజలు సక్రమంగా ఆలోచించడం ఆరంభిస్తే తమ అస్తిత్వానికి ప్రమాదమని గ్రహించిన పాలకులు అనేక అశాస్త్రీయ అక్రమాలోచనల్ని క్రమబద్ధీకరించి జనాల్లోకి జొప్పిస్తారు. అతీత శక్తుల్ని విశ్వసించే వారెప్పుడూ అశక్తులుగా ఉంటారు. అలాంటివార్ని కుదిరినట్లు ఆడించడానికీ, ఇష్టమొచ్చినట్లు పాలించడానికీ వీలవుతుంది. అందుకే ప్రజల్ని అజ్ఞానులుగా ఉంచి తమ పబ్బం గడుపుకుంటారు సాంఘిక జలగలు. సమాజంలోని అత్యధిక శాతం మందికి అందుబాటులోకి రాని ప్రాథమిక అవసరాలైన తిండి, బట్ట, విద్య, వసతి, ఆరోగ్యం... మొదలైన వాటిని ఎరగా వేసి ప్రజల్లో మానసిక బానిసత్వాన్ని పెంపొందిస్తారు. అన్నదానం, వస్త్రదానం, విద్యాదానం... అంటూ జనాలకు జంగిలి మనస్తత్వాన్ని అలవాటుచేసి దాన్నే సంఘసేవగా ప్రచారం చేసుకుంటారీ ఆధ్యాత్మిక గుంటనక్కలు. దైనందిన జీవితాల్లో క్షణకాలం సైన్సుగాలి సోకకపోతే విలవిల్లాడిపోయి విగత జీవుల్లా తయారయ్యే మనం శాస్త్రాన్నీ ప్రకృతినీ అధ్యయనం చేయడానికీ, అసమానతలు ఎందుకున్నాయో అర్థం చేసుకోడానికి ప్రయత్నించకుండా అభౌతిక శక్తుల్ని ఆరాధించడం అమానుషం. ప్రశ్నించడం విజ్ఞానానికి, అనుసరించడం అజ్ఞానానికీ ప్రతీక. కాబట్టి ప్రజానీకం, ప్రధానంగా విద్యార్థులూ, యువతా ప్రతీదాన్ని ప్రశ్నించడం నేర్చుకోవాలి. హేతుబద్ధంగా ఆలోచించడం అలవర్చుకోవాలి. శాస్త్రీయ దృక్పథాన్ని పెంపొందించుకోవాలి. సక్రమ యోచనా వైఖరిని తర్కబద్ధంగా ఏర్పర్చుకోవాలి. ప్రశ్నే ప్రగతికి మూలం, ముఖ్యం, మార్గం.



# కరపత్రాల కథా కమామీషు

జీవితం ఒక సుదీర్ఘమయిన జిజ్ఞాస. జీవించడం జీవి ప్రాథమిక పిపాస. హేతుబద్ధమయిన జీవితంలో విశ్వాసానికి తావులేదు. మౌలికంగా మార్పుకేకాని మతాలకిందులో చోటులేదు. కొద్దోగొప్పో తెలివయినవాడ్ని తెలివితక్కువవాడిగా నిరూపించడం కోసం తెలివితక్కువ సంతంతా కట్టగట్టుకుని ప్రయత్నించడం కొత్తదేం కాదు. తమకంటే బాగా ఆలోచించగల వ్యక్తి ఔన్నత్యాన్ని దిగజార్చడమే లక్ష్యంగా అవివేకులంతా తోచినప్పుడల్లా సమావేశమవడం కూడా సాధారణమయి పోయింది. అంతో ఇంతో బుర్రగలవాడిపై ఎంతో కొంత బురద జల్లి బుద్ధిమంతుడ్ని బుద్ధిహీనుడిగా ప్రచారం చేస్తూ తృప్తిపడే బూడిదబుర్రలకూ కొదవలేదు. మూర్ఖులందరూ మూకుమ్మడిగా మేధావిని మూఢుడిగా చూపించే ప్రయత్నం చేస్తూ, తమకంటే మంచివాడ్ని ఏదో విధంగా కించపరచడం ద్వారానే తమ అస్తిత్వానికి సరైన గుర్తింపు లభిస్తుందనుకోడం కూడా కద్దు. నిజం చెప్పడానికి భయపడని వాడ్ని చూసి భయపడి, నిజం చెప్పకుండా భయపెట్టాలని చూసినంతలో నిజం, నిజం కాకుండా పోదు. అబద్ధాన్ని అందంగా ప్రదర్శించడానికి అలవాటు పడి, అబద్ధాన్నే నిజంగా నిరూపించడానికి ప్రయత్నించినంతలో అబద్ధం నిజం అయిపోదు. సమాజానికి విలువివ్వని వ్యక్తుల్ని గౌరవించే లక్షణమున్న వ్యవస్థ, సమాజానికి విలువిచ్చే వ్యక్తుల్ని అగౌరవపరచడం సహజం. అందుకే, సంఘానికి ఉపయోగపడే సామర్థ్యం సమకాలీనులచేత నిజాయితీగా గుర్తించబడటం అరుదు. వ్యవస్థకి పనికొచ్చే వ్యక్తిత్వాలు



వర్తమానంలో గ్రహించబడడం కష్టం. ఎంతకూడదన్నా ఏదోక సంకుచితత్వం వ్యక్తుల్ని సంపూర్ణంగా స్పందించనివ్వదు. సమూహతత్వాన్నే సమిష్టితత్వంగా భ్రమసే మూక మనస్తత్వాలు, మూగినంత మందిని కూడగట్టుకుని వూగినంతలోనో, కూడినంత మందిని సాగదీసుకుని తూలినంతలోనో ఒరిగేదేం లేదు. సంఘ సంస్కారం లేని వ్యక్తిత్వాల వల్లా, వ్యక్తిత్వ లేమికల సంఘాల వల్లా ప్రయోజనం లేదు. సమిష్టి తత్వానికర్థం ముఠాతత్వం కానట్లే, వ్యక్తిత్వానికర్థం ఏకాకితత్వం కాదు. వ్యక్తి–వ్యవస్థ ఎప్పటికీ పరస్పర ప్రేరకాలు, ప్రేరణా కారకాలు, ప్రగతి రథ చక్రాలు. వాటికి అడ్డొచ్చే అజ్ఞానం ఆధ్యాత్మికతయితే, విజ్ఞానం నా వాస్తవికత. అణిచివేత అధికార మార్గమయితే, ఎదురు తిరగడం నా నైజం. విశ్వాసం వ్యవస్థీకృత మత విధయితే అవిశ్వాసం నా హక్కు!

## తత్వ విచారణ – తర్కవివేచన (Philosophical Enquiry - Logical Wisdom)

అక్షరాల్ని వివేకంతో వీక్షించి దార్శనికంగా తర్కించడం వేరు, మొక్కుబడిగా చదివి అయిందనిపించి మౌనం పాటించడం వేరు. కొంతకాలం నుంచి నిర్విరామంగా శక్తివంచన లేకుండా ముద్రిస్తోన్న పుస్తకాలకవుతోన్న ఖర్చు కనీసంగానైనా ముట్టకపోవడం పట్ల కూడా నేనెప్పుడూ బాధపడలేదు కానీ, ఎంతో కొంత సన్నిహితులనే భ్రమతో పనిగట్టుకు పంపుతున్న గ్రంథాల్ని అందుకుంటున్న అచేతన మేధావులంతా తిరిగి నేనడిగితే తప్ప పుస్తకాలొచ్చాయనే విషయాన్ని నాకు చెప్పడానికి కూడా తీరికలేనంత ఇరుకుగా బతుకుతున్నారని తెలిసినప్పుడు మాత్రం మనసుకి కష్టమనిపిస్తుంది. వారి స్తబ్దతకి సిగ్గనిపిస్తుంది.

నేనెప్పుడైనా మానవతను ప్రాతిపదికగా ఎంచుకున్న సొంత మెదడుకల మిత్రుల్నే ఆశించాను కానీ, మూస మనస్తత్వపు మూకల్ని కాదు. వ్యవస్థాగతంగానే వైరుధ్యాల్ని ఆహ్వానించాలనే వైవిధ్య హృదయం కలవాడ్ని, వ్యక్తిగతంగా నన్ను మాత్రమే అనుసరించమని సిగ్గు లేకుండా ఎలా చెప్పగలను? నా అక్షరాల్లో, ఆచరణలో ఎక్కడైనా అలాంటి తప్పులు దొర్లితే, అట్టే పెంకితనానికి పోయి అనవసరంగా అల్లరిచేసి లొల్లి లేకుండా చెంపలు పట్టుకుని లెంపలేసుకుంటాను గానీ అంతిమంగా అందరూ అసూయద్వేషాల్ని అధిగమించగల స్థాయికి ఎదిగినప్పుడే ఆధునికమైన నాగరికత ఔన్నత్యం సాధ్యపడుతుందని నా భావన.

అనేక ఆర్థిక – సాంఘిక సమస్యలు ఆద్యంతం చుట్టుముట్టి ఆదరాబాదరాగా దడికట్టి అడ్డుగోడల్ని నిర్మించాలనే కుట్ర పన్నినపుడు సైతం స్వేచ్ఛకి భాష్యం చెప్పాలనే నా కోరిక చావలేదు. ఎలాగూ దక్కని ధరకోసం పుస్తకానికి వెలకట్టి వ్యక్తిత్వంలోని వెలితిని వెల్లడించుకోడం ఇష్టంలేకే దీని విలువ పాఠకుల అభీష్టానికే వొదిలేసాను. ముష్కర దాడుల మధ్య బయటికి తెస్తున్న మూడో పుస్తకమిది. సత్యాన్వేషణకి సంచలనాల సవారీలక్కర్లేదు. వాస్తవాల శోధనకి వాగాడంబరాలతో పన్లేదు. యదార్థ వేదనలకి యతిప్రాసలతో కూడిన చిత్రణ సరికాదు. రచన సామాజిక బాధ్యతకేకాని సాంఘిక హోదాకి సంకేతం కాదు, కారాదు. జై ఇన్‌సాన్




# పురుషుడు – స్త్రీ (మూలం : చలం, అనువాదం : గౌరవ్)

విశ్వాంతరాల్లోని కక్ష్యల్ని సైతం ఈనాటి క్షిపణులు ఛేధించగలవు. అనూహ్యమయిన అగ్నిగోళాల్ని అణుబాంబులు సృష్టించగలవు. ప్రపంచాధినేతలంతా శిఖరాగ్ర సభల్లో మమేక మయ్యారు. వారిక ఇంటిదారి పట్టే జాడలు కనిపించడం లేదు. అత్యాధునిక సూపర్‌సోనిక్ విమానాల వేగం కాంతి పథాన్ని భయపెడుతోంది. దూరాలు ఛేధించ బడ్డాయి. జ్ఞాపకాలు బేధించబడ్డాయి. జాతీయ సౌభ్రాతృత్వం ప్రపంచ ప్రభుత్వపు ప్రమాణాల్నీ, ప్రమాదాల్నీ తనలో తప్పనిసరి తత్వంగా నిక్షిప్తం చేసుకుంది.

విశ్వమానవులే విశ్వానికి వారసులు. ప్రపంచ పాలకులు. ఒక అద్భుతమైన లోకం, నూతన అద్వితీయ సంస్కృతి, సరిహద్దుల్లేని సర్వమానవ శ్రేయోజగత్తు, వారికోసం ఎదురు చూస్తున్నాయి.

అప్పుడిక స్వార్ధపు స్వభావాలకీ – మానసిక శూన్యాలకి చిహ్నాలైన విభజనలకి తావుండదు. అకాల అహంభావాలకసలే ఆస్కారముండదు. నూతన సత్యాలే అవతరిస్తుంటాయి. కొత్త విషయాలు మాత్రమే ఉద్భవిస్తుంటాయి. బహుశా అదే ఒక సరికొత్త స్వార్ధాతీత మానవుడు ఆవిర్భవించే మరో ప్రపంచమేమో.

మూతపెట్టిన మానవాళి భవిష్యదర్శినిలోంచి ఈ మహనీయుడయిన మానవుడి ఆగమనాన్ని నేను లీలగా చూడగలుగుతున్నాను. ఈ అనంత కాలవాహినిలో నా ప్రస్థానపు అడుగుజాడల్ని అన్వేషిస్తూ, నా అస్తిత్వానికి ఆద్యంతాలని నిర్దేశించి దానికే జీవితమనే సార్ధక నామకరణం చేసుకున్నాను.

నేను వెళ్ళిపోవచ్చు, లేదా వేచి వుండవచ్చు. నా కథ ఇక్కడితో అంతం కావచ్చు. లేక అదే నూతన ఆరంభమూ అవ్వొచ్చు. ఏది ఏమైనా ప్రతీదీ చారిత్రక చలనం కోసం సంకల్పించేదే. ఘటనల గమనంలోంచి సామూహికంగా సంఘటనల్లో చేరేదే. అజరామర ప్రవాహంలో అజ్ఞాతంగా కలిసి మిళితమైపోయేదే.

సోక్రటీస్ మహాశయుడి సాక్షిగా ప్రపంచానికి ప్రణమిల్లి ప్రకటిస్తున్నాను, 'నాకేమీ తెలీదు, అస్సలేవీ తెలీదు'

నాకు దేనిమీదా ద్వేషం లేదు. విద్వేషం అంతకన్నా లేదు. అయిష్టం ఏ కొద్దివాటి మీదో తప్పలేదు. మానవత్వమంటే నాకిష్టం. అయినా కూడా కొందరినే నే ప్రేమించ గలిగాను. నా ప్రేమని కొంతమందికే పంచగలిగాను.

మీ ముందు నా మనసు తెరలు దించే సమయం వచ్చింది. ఈ సమయంలో విభిన్న విషయాలు నా మనోఫలకంపై సుమనోహరంగా అవిరామ నృత్యం చేస్తున్నాయి. ఒక సర్వపరిత్యాగయిన సన్యాసి ఇప్పుడే నా గుండెలో తన గొంతుతో ఇలా ఉపదేశిస్తున్నాడు,

**'సర్వలోకాః సుఖినోభవంతు'**